


# VEERESALINGAM RACHANALU
## THIRD VOLUME

వీరేశలింగం రచనలు – మూడవ సంపుటం

ప్రచురణ సంఖ్య : 1107

ప్రతుల సంఖ్య : 2000

ప్రథమ ముద్రణ : ఏప్రియల్, 1985



వెల : రు. 25/-

ముఖచిత్రం : చంద్ర

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్,
విజయవాడ – 520 004.

# పీఠిక

## మొదటి కూర్పు

ఈవఱకు మన యాంధ్రభాషలో జనుల యాచార వ్యవహారములను దెలుపుచు నీతిబోధకములుగా నుండు వచనప్రబంధము లేవియు లేకపోవుట యెల్ల వారికిని విశదమయియే యున్నదిగదా ? అయినను దేశ భాషలలో నెల్లను మధుర మైనదని పేర్కొనఁబడిన మన తెనుఁగుభాష కటువంటి లోపమును తొలఁగింపవలయు నని కొంతకాలము క్రిందట నేనీ గ్రంథమును వ్రాసి శ్రీ వివేకవర్ధనీ పత్రికాముఖ మునఁ బ్రకటించితిని. ఇట్టి గ్రంథములను వ్రాయుట కిదియే ప్రథమ ప్రయత్న మగుటచేత దీనియందుఁ బెక్కులోపము లుండి యుండవచ్చును అయినను దీనిం జదివినవారందఱును నైకకంఠ్యముగా మంచి యభిప్రాయమునే యిచ్చుచు వచ్చినందు నను పలువురు పుస్తకముల నిమిత్తమయి వ్రాయుచు వచ్చుచున్నందునను నేను పడిన ప్రయాసము నిష్ఫలము కాలేదుగదా యని సంతోషించుచున్నాను.

* * * *

ఈ గ్రంథముయొక్క కథను గల్పించుటలో గోల్డుస్మిత్తను నింగ్లీషు కవీశ్వరుని గ్రంథసాహాయ్యమును గొంతఁ బొందినను దానికిని దీనికిని విశేష సంబంధ మేమియు నుండదనియు దీనియందు వ్రాయఁబడిన విషయములన్నియు నూతనములే యనియుఁ గూడ విన్నవించు చున్నాఁడను. గుణగ్రహణ పారీణు లగు పెద్దలు దీనియందు దోషముల నుపేక్షచేసి గుణములనే గ్రహింతురనియు ఆంధ్ర దేశీయులును, విద్యాశాఖవారును దీని నాదరించి మఱియు నిట్టి గ్రంథము లను చేయుటకయి నాకుఁ దగినంత ప్రోత్సాహమును గలిగింతురనియుఁ గోరు చున్నాఁడను

రాజమహేంద్రవరము<br>20 జూలై, 1880 సం॥రం } కందుకూరి వీరేశలింగము

---

## రెండవ కూర్పు

ఈ పుస్తక మింగ్లీషులోనికి భాషాంతరీకరింపఁబడి పుస్తకరూపముగాఁ బ్రక టింపఁబడియున్నందున, మార్పులను చేసినచో భాషాంతర గ్రంథము యొక్క సహాయ్యముచేత దీనిం జదివెడి యన్యదేశీయులకు కష్టముగానుండునని యెంచి చేయఁదలచుకొన్న మార్పులను జేయక మొదటి కూర్పులో నున్నట్లే దీనిని మరల ముద్రింపించినాఁడను.

రాజమహేంద్రవరము,<br>2 జనవరి, 1894 సం॥రం. } కందుకూరి వీరేశలింగము

# అక్కిరాజు మనవి

వీరేశలింగం రచనల యీ మూడో సంపుటంలో మూడు నవలలు కూర్చడం జరిగింది. ఈ మూడు నవలలు కూడా ఆధునిక తెలుగు నవలా రచనకు రూప రేఖలు దిద్దినటువంటివి. ఈ నవల తర్వాత వెలువడ్డ నవలలకు మార్గదర్శకత్వం వహించాయి.

మొదటి నవలలో సంఘంలో పురుషుడు నడుచుకోవాల్సిన తీరుతెన్నుల గురించీ రెండో నవలలో సంఘంలో స్త్రీ తన కుటుంబ జీవితాన్ని దిద్దుకోవాల్సిన నడవడికల గురించీ పంతులుగారు ప్రతిభావంతంగా ప్రబోధించారు

సామాజిక జీవనంలో ఇంటాబయటా కూడా బుద్ధిమంతులైన స్త్రీ పురుషులు ఎటువంటి సంస్కరణలు సాధించాలో, ఎటువంటి ఆదర్శాలవైపు పయనించాలో చాటిచెప్పిన నవలలు సత్యవతీ చరిత్రము, రాజశేఖర చరిత్రమున్నూ గృహిణీ గృహముచ్యతే, ఇల్లు చూడు ఇల్లాలిని చూడు అనే సూక్తులకు వ్యాఖ్యానం పంతులుగారు రచించిన సత్యవతీ చరిత్రము తెలుగులో కుటుంబ జీవితేతి వృత్తాన్ని స్వీకరించిన నవలలో ఇదే మొదటిది. కుటుంబం కుదురుగా ఉంటే, విద్యా సంస్కార వికాసంతో వర్ధిల్లితే సమాజ శ్రేయస్సు త్వరితగతిని సాధించ వచ్చునన్నది పంతులుగారి ప్రబోధం

మూడో నవల సత్యరాజా పూర్వదేశ యాత్రల ద్వారా మన సంఘంలో స్త్రీకి తరతరాలుగా జరుగుతున్న అన్యాయాలను వీరేశలింగం విమర్శించారు. ఈ నవలలోనే రెండో భాగంలో జాతకాలు, మూఢ విశ్వాసాలు, గ్రహచారాలు, శకునాలు ఆయన హేళన చేశారు

ఈ మూడు నవలలూ ముందుగా పత్రికలలో వెలువడ్డవే. రాజశేఖర చరిత్రం వివేకవర్ధనిలోను, సత్యవతీ చరిత్రం సతీ హిత బోధినిలోను, సత్యరాజా పూర్వదేశ యాత్రలు చింతామణిలోనూ ఆ రోజుల్లో మొదట ప్రచురితమైనాయి తరవాత పుస్తకరూపాన వచ్చాయి. చింతామణి పత్రిక పేరుకు న్యాపతి సుబ్బారావు పంతులు గారి నిర్వహణలో ఉన్నా నిజానికి నిర్వహించింది వీరేశలింగం పంతులే. అందు

వల్ల ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారిగా చింతామణి పత్రిక నిర్వహించిన నవలా రచనా పోటీల నియమ నిబంధనలు, వివరణలు ఈ సంపుటంలో అనుబంధంగా ఇవ్వడం జరిగింది.

వీరేశలింగం నవలలను గూర్చి స్థూలంగా ఒక సమీక్షను ఉపోద్ఘాతంగా ఇవ్వడం జరిగింది. ఇతివృత్త నిర్వహణంలో కథాకథనంలో జీవిత వాస్తవిక చిత్రణను ప్రతిబింబింప చేయడంలో పంతులుగారి శక్తిసామర్థ్యాలు ప్రజ్ఞా పాటవాలు వ్యక్తం కాగల ఆయా విశేషాంశాలు ఆయా సందర్భాలలో, సన్నివేశాలలో వివరణ సూచికలుగా పుట అడుగు భాగంలో ఇవ్వడం జరిగింది.

వీరేశలింగం పంతులుగారి సాహిత్య సామాజిక వికాసోన్ముఖ కృషి గురించి ఆయన వ్రాసిన ప్రహసనాలు, వ్యాసాలు, విమర్శలు ఇంకా కొన్ని సంపుటాలుగా వెలువడ్డప్పుడు ఆయన సమగ్రమూర్తిత్వాన్ని ఈతరం పాఠకులు ముందు తరాల వారు అవగాహన చేసుకోవటానికి విశాలాంధ్ర ప్రచురణ సంస్థవారు దోహదం చేసినవారవుతారు. ఆయన వారసత్వాన్ని ముందు తరాలవారికి ఉత్తేజకరంగా భద్రపరచిన వారవుతారు. ఈ అవకాశాన్ని నా కిచ్చిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారి యెడల మిక్కిలి కృతజ్ఞుణ్ణి

—అక్కిరాజు రమాపతిరావు

# నవలా రచనకు వరవడి

తొలి తెలుగు నవల ఏది ? అనే విషయం ఇటీవల కొంత చర్చకు కారణ మైంది. తన సాహిత్య వ్యవసాయాన్ని గూర్చి ముచ్చటిస్తూ స్వీయ చరిత్రలో "తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని" అన్నాడు వీరేశలింగం. కొందరు దిన్ని ఆత్మశ్లాఘ గావించి ఆయన్ను విమర్శించారు కూడాను తొలి రోజుల్లో నవలను వచన ప్రబంధమనీ, నవీన ప్రబంధమనీ అనేవారు. అందువల్ల నే వీరేశలింగం 'నవల' అనే అర్థంలో వచన ప్రబంధమని పేర్కొన్నాడు.

1872 వ సంవత్సరంలో అంటే వీరేశలింగం కన్నా ఆరేళ్ళ ముందరే నరహరి గోపాలకృష్ణమ చెట్టి అనేవారు 'శ్రీరంగరాజు చరిత్రము' అనే వచన ప్రబంధము రచించారనీ కాబట్టి వీరేశలింగం చెప్పుకొనే ప్రాథమ్యం ఆయనకు లభించదనీ వొకవాదం వుంది. వచన ప్రబంధం అనీ నవీన ప్రబంధం అనీ నవలా ప్రక్రియకు మొదట సమానార్థకాలుగా వాడుక చేసింది కూడా గోపాలకృష్ణమ్మగారే ఆనాటి భారతదేశపు గవర్నర్ జనరల్ లార్డు మేయో బెంగాల్ గెజెటులో ఒక ప్రకటన చేయించారు ఏమంటే బంగాళీ ప్రజల ఆచార వ్యవహారాలను వర్ణిస్తూ ఒక కల్పితమైన రచన చేసే వారికి బహుమానం ఇస్తామంటూ. ఇంగ్లీషు వారైన ఆనాటి ప్రభుత్వోద్యోగులకు దేశీయుల ఆచారాలు, సంప్రదాయాలు సాంస్కృతికమైన కట్టుబాట్లు తెలుసుకోవాలనే కుతూహలం మాట అట్లావుంచి తెలుసుకోవాల్సిన అగత్యం ఎంతైనా వుండేది అందువల్ల కార్యనిర్వాహక, న్యాయశాఖలలో పనిచేసే ఉన్నతోన్నతాధికారులంతా ప్రాంతీయ భాషలు నేర్చు కొనేవారు. భారతదేశంలోని జనుల ఆచార వ్యవహారాలను గురించి తెలుసు కోవాలనే ఉద్దేశంతోనే ఆనాటి గవర్నర్ జనరల్ మేయో ప్రభువు అటువంటి ప్రకటన గెజెట్‌లో వెలువరించి ఉంటారు.

అప్పట్లో ఆంధ్రదేశంలో కర్నూలులో నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టిగారు డిప్యూటీ కలెక్టర్‌గా ఉండేవారు బెంగాల్ గెజట్‌లోని ప్రకటన ఆయన చూడడం తటస్థించింది బహూశా తెలుగులో కూడా అటువంటి ప్రయత్నం చేయడానికి చెట్టి గారి నా ప్రకటన ప్రేరేపించి ఉంటుంది గోపాలకృష్ణమ్మగారు శ్రీరంగరాజు చరిత్రం వ్రాసి వెంటనే ముద్రించారు ఇదంతా కూడా ప్రకటన వెలువడిన ఆ సంవత్సరంలోనే జరగటం విశేషం ఈ శ్రీరంగరాజు చరిత్రను గూర్చి ప్రస్తా విస్తూ మద్రాసు గెజట్ ఇది తెలుగులో వెలువడ్డ మొదటి నవల అని పేర్కొనడం కూడా జరిగింది అంతేకాదు ఆ రోజుల్లో బందరు నుంచి వెలువడుతూ ఉన్న

పురుషార్థ ప్రదాయిని అనే సాహిత్య సామాజిక మాస పత్రిక శ్రీరంగరాజు చరిత్రను సమీక్షిస్తూ ఇంగ్లీషులో నవల అనీ తెలుగులో వచన ప్రబంధమనీ యీ రచనను గూర్చి పేర్కొనడం గమనార్హం కాబట్టి తెలుగులో నవలారచనకు తొలి ప్రయత్నం గోపాలకృష్ణమ్మగారి శ్రీరంగరాజు చరిత్రయే అని ఇందువల్ల అర్థమవుతున్నది.

కిందటి శతాబ్ది ఉత్తరార్థం ప్రవేశించేవరకూ తెలుగులో వచన రచన ఎక్కువ వ్యాప్తికి రాలేదు. ఒక వేళ ఏవో కొన్ని వచన రచనలంటూ ఉన్నా అవి మౌలికమైనవి కాక ఇతిహాస పురాణాదుల నుంచి జానపద వాఙ్మయం నుంచీ వచన రూపంలో వ్రాసిన కథలుగా మాత్రమే ఉండేవి భారతదేశంలో విశ్వ విద్యాలయాల స్థాపన జరిగి ఇంగ్లీషు సాహిత్యంతో తగినంత పరిచయం ఏర్పడిన నవీన విద్యా వంతుల తరం బయలుదేరిన తరువాతనే ప్రాంతీయ భాషా సాహిత్యాలలో ప్రక్రియా వైవిధ్యం ప్రారంభమైంది

మొట్ట మొదటి 25 సం॥ల వరకు తెలుగులో ఈ ఆధునిక ప్రక్రియకు నవల అనే పేరుండేదికాదు. వచన ప్రబంధమని మాత్రమే ఈ రకమైన రచనను గూర్చి ప్రసక్తం చేసేవాళ్ళు ఆసక్తికరమైన విషయం ఏమంటే మొదటి పాతిక సంవత్సరాలలో పాతిక నవలలు కూడా వెలువడలేదు తెలుగులో ఇటువంటి ప్రక్రియ ప్రారంభమై పాతికేళ్ళు గడిచిన తర్వాతనే యీ ప్రక్రియను ఇంగ్లీషులో లాగానే నవల అని తెలుగులోనూ పిలవడమే సబబు అని కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రను విమర్శిస్తూ ప్రకటించిన గ్రంథం ఉపోద్ఘాతంలో అభిప్రాయపడటం జరిగింది ఆ తరువాత క్రమంగా పదేళ్ళకల్లా ఈ రచనాప్రక్రియకు తెలుగులో కూడా నవల అనే పేరు రూఢమైంది

మరి అయితే వీరేశలింగం తానే తెలుగులో మొదటి వచన ప్రబంధం రాశానని ఎందుకన్నట్లు ? శ్రీరంగరాజు చరిత్ర గూర్చి ఆయనకు తెలియదా ? అసలా పుస్తకాన్ని ఆయన చూడలేదా ? చదవ లేదా ? అంటే, పురుషార్థ ప్రదాయిన్ని పత్రికలో వీరేశలింగం కూడా రచనలు చేస్తూనే ఉండేవాడు కాబట్టి ఆ పత్రికలో వెలుపడ్డ శ్రీరంగరాజు చరిత్ర సమీక్ష కూడా వీరేశలింగం చూసే ఉంటాడు. ఆయన ఈ వచన ప్రబంధం చూశాడు. చదివాడు. తన పుస్తక సందోహంలో దీన్నికూడా సేకరించుకున్నాడు. బహుశా ఆయన దృష్టికి నవీన ప్రక్రియకు ఆద్యమని చెప్పదగిన ప్రౌఢరచన అది అని అనిపించి ఉండకపోవచ్చు. అప్పటికి నాలుగు వందల సంవత్సరాల క్రిందట జరిగిన కథ ఇది అని గోపాల కృష్ణమ్మ చెట్టి తొలిపలుకులో చెప్పడం, నాయకుడు మహాకులీనుడై ఉండాలన్న ఆలంకారిక నియమాన్ని ఉల్లేఖించడం, ఈ వచన ప్రబంధంలోని నాయకుడు లంబాడీ పిల్లను ప్రేమించాడని వర్ణించడం, విజయనగరం, కొండవీడు సంస్థానాలు రంగస్థలంగా ఈ కథ జరగడం, ఈ విధమైన చారిత్రక జానపద గాథా వాసనా

వాసితంగా ఈ కథ అంతా ఉండడంవల్లనూ, ఇంగ్లీషు సాహిత్య ప్రక్రియ ప్రభావం ఈ రచనపై ఏ మాత్రమూ లేకపోవడంవల్లనూ నరహరి గోపాలకృష్ణమ్మచెట్టిగారి విషయంలో నవలా రచన ప్రాథమ్యం వీరేశలింగం వొప్పుకోలేదని స్పష్టపడు తున్నది అందువల్ల వీరేశలింగం ఈ రచనా ప్రయత్నానికి ఇవ్వవలసిన గుర్తింపును ఇవ్వలేదనిపిస్తున్నది.

అయితే ఇటువంటి రచనకు నరహరివారు పెట్టిన వచన ప్రబంధమనే పరిభాషను మాత్రం వీరేశలింగం శ్రీరంగరాజు చరిత్ర నుంచే గ్రహించాడు. అల్లసాని పెద్దన నుంచి అటు తరవాత సంస్కృతం నుంచి మూలగ్రంథానికి అనువాదం కాకుండా కవి ప్రతిభనుబట్టి వర్ణనా బహుళంగా స్వతంత్ర రచన అనిపించేట్లు నిర్వహించిన కావ్యరచనను ప్రబంధమని పిలవటమూ, ఆ కవులందరినీ ప్రబంధ కవులనటమూ జరిగినట్లే, గోపాలకృష్ణమ్మ కాలం నుంచీ వచన రచన అయిఉండి తెలుగులోని ప్రబంధ రచన మాదిరిగానే రేఖా మాత్రంగా ఏదైనా మూలాన్ని మాత్రం అనుసరిస్తూ ఇతివృత్తాన్ని సృష్టించటాన్ని వచన ప్రబంధమనే ప్రక్రియగా ఆనాటి సాహితీపరులు భావించినట్లు కనపడుతుంది అప్పట్లో ఇతివృత్తం కేవలం సామాజికంగా ఉండాలని ఏమీ నిబంధనలేదు. చరిత్ర నుంచో, పురాణ గాథల నుంచో కూడా తీసుకొని క్రొత్త తరహాగా నిర్వహించడమూ, అది వచన రచనగా ఉండడమూ అయితే దాన్ని వచన ప్రబంధంగా పరిగణించారు. అటు తర్వాత పాతిక, ముప్పై సంవత్సరాల వరకు ఈ నూత్న సాహిత్య ప్రక్రియ నవలగా పేరు పొందలేదు

మొట్టమొదటి ప్రయత్నమైన శ్రీరంగరాజు చరిత్రను ఆనాటి గవర్నర్ జనరలైన లార్డు మేయోకు అంకితం చేశాడు రచయిత 'హిందువుల యాచారములు తెలుపునట్టి నవీన ప్రబంధము' ని గ్రంథకర్త యీ గ్రంథాన్ని గూర్చి పేర్కొన్నాడు. ఈ నవలా రచనకై తనను ప్రేరేపించిన విషయం రచయిత ఇట్లా ప్రస్తావించాడు.

"పది నెలలనాడు లార్డు మేయోగారు బంగాళిల యాచారంబులు తెలుపు ప్రబంధము గావించు వానికి బహుమానంబు చేయబడునని ప్రచురము చేసిరి అది నేను చదివినప్పుడు తెలుగు దేశము వారియాచారంబులు తెలుపునట్టి ప్రబంధం బొకటి రచియించుట తెలుగువారికుపయుక్తం బగునని తలంచి నా నేర్పుకొలదిని ప్రబంధంబు చెప్పబూనితిని".

"ఇది కేవలము కల్పితంబు కథానాయకుండు - మహాకులీనుడై యుండ వలయునను యాదేశంబున మున్ను దొరతనము చేసిన విద్యానగరరాజు వంశము వారిలో శ్రీరంగరాజును పేరు గైకొంటిగాని యింపు జెప్పిన చరితము యథార్థముగా జరిగిన కథయని యెంచగూడదు. ఇందు జెప్పిన యాచారములు మాత్రము యథార్థముగా నాచరింపబడునవి. ఈ కథ 400 సంవత్సరముల నాడు జరిగినట్లుగా చెప్ప

బడియెగానియప్పటియాచారములకు నిప్పటి యాచారములకును లేశంబుగాని భేదంబు లేమింజేసి యిందుదహరింపబడిన యాచారంబులన్ని యిపుడాచరింపబడుచున్నవని యెఱుంగునది — కేవల గద్యాత్మకములయిన తెనుగు ప్రబంధములు — విశేషము లేమింజేసి యిది తెనుగు విద్యార్థులకు సయితముపయోగించునని తలచెద".

శ్రీరంగరాజు చరిత్రం ఐదు ఉల్లాసాల గ్రంథం. మొదటి ప్రకరణంలోను చివర ప్రకరణంలోనూ కథ అంతా చక్కగా ఉన్నది కాని మధ్య మూడు ప్రకరణాలలో కథ చాలా పలచగా ఉంది. 88 పుటల క్రౌ డెమ్మీ పరిమాణంలో ఉన్న పుస్తకం ఇది జానపద వాఙ్మయంలోని గంగా గౌరీ సంవాదం కూడా యీ పుస్తకంలో చేర్చారు రచయిత.

ఈ ప్రయత్నంలో మెచ్చవలసిన విషయం ఏమంటే ఇందులోని సులభ శైలి. గోపాలకృష్ణమ్మగారు చిన్నయసూరితో కలిసి ఇంగ్లిషు నుంచి థామస్ స్ట్రేంజ్ అనే ఆయన రచించిన న్యాయశాస్త్ర క్రోడీకరణ గ్రంథాన్ని కూడా తెలుగు చేసిన సహరచయిత. అయి ఉండే చిన్నయసూరి శైలిని శ్రీరంగరాజు చరిత్రలో అనుకరించకపోవడం చాలా శ్లాఘపాత్రమైన విషయం.

తొలి తెలుగు నవల ఎవరు రచించారు అనే విషయంలో ఇంకో పూర్వపక్షం కూడా ఉంది. ఏమంటే కొక్కొండ వేంకటరత్నం పంతులుగారే తెలుగులో నవలా రచనకు ఆద్యులని వేంకటరత్నం పంతులుగారి శిష్యుడైన ఆర్ శివశంకరపాండ్యా అనే వారు పంతులుగారు రచించి ప్రచురించిన పంచతంత్ర విగ్రహతంత్రానికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ 1867 వ సంవత్సరానికే తమ గురువుగారు మహాశ్వేత అనే నవల రచించారనీ, అందువల్ల తెలుగులో నవలా రచన వారితోనే ప్రారంభమైందనీ ప్రతిపాదించారు. కాని వేంకటరత్నం పంతులుగారు బాణభట్ట కాదంబరిలోని మహాశ్వేత వృత్తాంతాన్ని మక్కికి మక్కిగా అనువదించిన విషయం యీ రచనను చూసిన వారికి బోధపడుతుంది కొక్కొండవారు 1867 నాటికే అనువదించినా అటు తర్వాత 30 సం॥లకు కాని యీ రచన ప్రచురితం కాలేదు. కిందటి శతాబ్ది చివరి దశకం చివరి సంవత్సరాలలో వెలువడుతూ వచ్చిన శ్రీ వైజయంతి అనే పత్రికలో వేంకటరత్నం పంతులుగారి మహాశ్వేత వెలువడింది. కొక్కొండ వారు చేసిన మార్పు అల్లా కాదంబరిని ఆసాంతం అనువదించకుండా అందులోని కథాభాగాన్ని కొంత మాత్రమే అనువదించటం. అంతేకాదు ఆధునిక సాహిత్య ప్రక్రియ అనిపించే శైలికాదు ఆ పంతులుగారిది.

ఇక వీరేశలింగం రాజశేఖర చరిత్ర విషయానికి వస్తే కథా నిర్మాణ విషయంలోకాని, శైలి విషయంలోకాని, సామాజిక వాస్తవికతా ప్రతిబింబం విషయంలో కాని శ్రీరంగరాజు చరిత్రకన్నా ప్రశస్తమైన రచన అంతే కాకుండా అటు తరువాత తెలుగులో నవలారచన చేసిన వారంతా వీరేశలింగంగారి రాజశేఖర చరిత్రనే మార్గదర్శకంగా ఎంచుకున్నారు తెలుగులో మొట్టమొదటిసారిగా నవలా

రచనలో పోటీ నిర్వహించిన చింతామణి పత్రిక కూడా యీ పోటీలో పాల్గొనే వారికి మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రనే చూపింది ఈ పోటీకి నవలలు పంప దలచుకొన్నవారు అనుసరించవలసిన నియమ నిబంధనలతోపాటు మార్గదర్శక సూత్రాలను వివరిస్తూ రాజశేఖర చరిత్రను చదివి నవల ఏ విధంగా వ్రాయాలో తెలుసుకోవచ్చునని ఆ పత్రిక వివక్షించింది.

చిలకమర్తి లక్ష్మీనరసింహం అప్పట్లో నవలారచనకు మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రనే అనుసరించి తన రామచంద్ర విజయం వ్రాసినట్లు స్వీయ చరిత్రలో పేర్కొన్నారు. పధ్నాలుగు సంవత్సరాల వ్యవధానంలో రాజశేఖర చరిత్ర ద్వితీయ ముద్రణం గూడా పొందింది. పుస్తక రూపంలో యీ తెలుగు నవల వెలువడ్డ ఐదారేళ్ళలోనే ఇంగ్లీషులోకి కూడా అనువాదం పొందింది ఇది అరవంలోకి, కన్నడంలోకి కూడా ఆ రోజుల్లోనే అనువాదమైనట్లు పంతులుగారు స్వీయ చరిత్రలో వ్రాశారు కాబట్టి రాజశేఖర చరిత్రం వెలువడ్డ తర్వాత ఆధునిక తెలుగు సాహిత్యంలో అది మంచి ప్రసిద్ధికి వచ్చినట్లుగా చెప్పవచ్చు క్రిష్టియన్ కళాశాల పత్రికలో రాజశేఖర చరిత్ర ఇంగ్లీషు అనువాదం రావడం, అటు తర్వాత లండన్‌లో రాజశేఖర అనువాదం 'ఫార్చ్యూన్స్ వీల్' (అదృష్ట చక్రం) అనే పేరున పుస్తక రూపాన ప్రకటితం కావడం, లండన్ టైమ్స్ పత్రిక యీ నవలను సమీక్షిస్తూ 1887 నాటికే గొప్పగా ప్రశంసించడం, ఆనాడు హిందూ పత్రిక కూడా యీ నవలను ఎంతగానో మెచ్చుకోవటం, ఈ నవల ఆ రోజుల్లో పొందిన ప్రసిద్ధికి తార్కాణ కదా !

## రాజశేఖర చరిత్ర

ఈ నవల ఇప్పటికి పది ముద్రణలదాకా పొందింది. దీనికి వివేక చంద్రిక అని కూడా ఇంకో పేరుంది స్వీయ చరిత్రలో ఈ విషయం ప్రసక్తం కాలేదు. కాని కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి విమర్శనంవల్ల రాజశేఖర చరిత్రకు వివేక చంద్రిక అని కూడా ప్రసిద్ధి ఉన్నట్లు తెలుస్తున్నది నవలా రచనా తొలి రోజుల్లో తెలుగు రచయితలు తమ నవలలకు రెండు పేర్లు ఉంచడం గమనార్హం శ్రీరంగరాజు చరిత్రకు కూడా సోనాబాయి పరిణయం అనే నామాంతరముంది. క్రమంగా ఈ రెండుపేర్ల సంప్రదాయం వెనకబడి పోయింది. నవలా రచనలో పోటీలు కూడా ప్రారంభమై నవలలు ఎక్కువగా రావడం మొదలైన తర్వాత యీ రెండు పేర్ల సంప్రదాయం పూర్తిగా విస్మృతమై పోయింది.

రాజశేఖర చరిత్ర రచనా సంకల్పం పంతులుగారికి ఎట్లా కలిగింది ? 1876 వ సంవత్సరంలోనే వీరేశలింగం చిన్నయ సూరి విడిచిపెట్టిన పంచతంత్ర భాగమైన విగ్రహతంత్రం తెలుగు చేశాడు అంతకు పూర్వమే కొక్కొండ

వెంకటరత్నం పంతులు కూడా విగ్రహతంత్రం అనువదించాడు. వీరేశలింగానికి వేంకటరత్నం విగ్రహ తంత్రానికి అనువాదం వెలయించినట్లు తెలియదు. తెలిసిన తర్వాత దానిని తెప్పించుకొని చూసి తన అనువాదం కూడా ప్రకటించదగినదే అని నిశ్చయానికి వచ్చి పుస్తకంగా ప్రచురించాడు.

వీరేశలింగం వచన శైలి ఆనాటి సాహితీపరులను బాగా ఆకర్షించింది. ఆయన విగ్రహ తంత్రానువాదానికి మంచి ప్రాచుర్యమున్నూ లభించింది. కళాశాల ప్రవేశ పరీక్షకు అంటే అప్పటి స్కూల్ ఫైనల్‌కు ఈ విగ్రహతంత్రం పాఠ్యపుస్తకంగా కూడా నిర్ణయించబడింది. ఈ రచనవల్ల ఆ రోజుల్లోనే పంతులుగారికి ఒక్కసారిగా వెయ్యిరూపాయల రాబడి కలిగింది. విగ్రహతంత్రాన్ని మెచ్చుకుంటూ ఆనాడు క్రిస్టియన్, కళాశాలలో గణితశాస్త్రాధ్యాపకుడు, దేశభాషా పర్యవేక్షణాధికారి అయిన సమర్థి రంగయ్యసెట్టి వీరేశలింగానికి ఒక ప్రశంసా లేఖ వ్రాస్తూ అందులో **'Can you not undertake the Writing of an Original novel in Telugu ?'** అని అర్థించారు ప్రోత్సహించారు. ఈ లేఖ వీరేశలింగం స్వీయ చరిత్ర రెండోభాగం రెండో అధ్యాయంలో ఉదాహృతమైంది 'తెలుగులో నొక స్వయం కల్పితమైన వచన ప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనలేరా ?' అని పై వాక్యాలకు పంతులుగారు అర్థం చెప్పారు. నవలా రచనకు శ్రీకారం చుట్టటానికి యీ ప్రోత్సాహక వాక్యం ఆయన్ను ప్రేరేపించింది.

"మొట్టమొదట నొక చిన్న యింగ్లీషు ప్రబంధమును దేనినైనను తెలిగించి శైలికుదురుపరచుకొని తరువాత స్వకపోలకల్పితమైన వచన ప్రబంధమును వ్రాయ బూనుకోవలెనని తలచి గోల్డుస్మిత్తనెడి ఇంగ్లీషు కవిచేసిన 'వైకర్ ఆఫ్ వేక్ ఫీల్డు' అనుకథను తెనిగింప నారంభించి రెండుమూడు ప్రకరణములు వ్రాసితిని. విదేశీకథయు దాని భాషాంతరమును మనవారికింపుగా నుండదని తోచి చేసిన భాగము నా మనస్సునకే తృప్తికరముగా నుండనందున దానిని మానివేసి రాజశేఖర చరిత్రమును వ్రాయనారంభించితిని" అన్నారు పంతులుగారుస్వీయచరిత్రలో. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు యీ వాక్యాలను విమర్శిస్తూ రాజశేఖర చరిత్ర ఆసాంతం ఇంగ్లీషు నవలకు అనువాదమే తప్ప వీరేశలింగం ప్రజ్ఞ ఏమీ లేదనడం కేవలం శాస్త్రిగారి స్పర్థయిక దృష్టిని మాత్రమే వ్యక్తం చేసుంది ఇంగ్లీషు గ్రంథానికి తన రాజశేఖర చరిత్రకు విశేష సంబంధం లేదనీ తెలుగువారిలో గల మూఢ విశ్వాసాలు పోగొట్ట టానికే తాను రాజశేఖర చరిత్ర రచించాననీ వీరేశలింగం అనడం సబబు అని ఈ నవలను జాగ్రత్తగా చదివితే తెలుసుంది. ఈ నవల మళ్ళీ ఇంగ్లీషులోకి అనువాదం పొందడం కూడా యీ విషయాన్నే నిరూపిస్తున్నది.

రాజశేఖర చరిత్రలో స్వీయ జీవితానుభవంనుంచి వీరేశలింగం ఎన్నో సన్నివేశాలను సృష్టించాడు, పాత్రలు రూపొందించాడు ఆనాటి సమాజంలోని

అనేక సంగతులను ఎత్తిచూపాడు. నోములు, వ్రతాలు, గుళ్ళు, గోపురాలు, శకునాలు, శాంతులు, ప్రయోగాలు, భూతవైద్యం, మఠాధిపతులదంభం, ఎరుకలు సోదెలు, వెలి పత్రికలు, మతంపేరిట మోసాలు, దౌర్జన్యాలు, కపట సాధువులు, దొంగలు మొదలైన అనేక విషయాలను సందర్భానుసారంగా ఈ నవలలో ఆయన ప్రస్తావించాడు.

రాజశేఖరచరిత్రం చక్కని కథా సంవిధాన నిర్వాహణం గల 15 ప్రకరణాల నవల. సరళమైన శైలి. ఉత్కంఠను పోషిస్తూ చదివిస్తుంది. రాజశేఖరుడుగారి ఇంటి వర్ణన అంతా తమ పెద్దలు కట్టించిన తమ ఇంటి వర్ణనమే అని స్వీయ చరిత్రలో పంతులుగారు చెప్పారు రాజశేఖరుడికి పాత్ర చిత్రణలో వీరేశలింగం తాతాగారి జీవిత ఘటాలకు ఎన్నో పోలికలు కనపడతాయి రాజశేఖర చరిత్రలోని నృసింహస్వామి కాశీయాత్ర మొదలైన ఘట్టాలలో పంతులుగారి బాల్య జీవితానుభవాలు అనుసంధానించారు పొందికగాని ముష్టి సర్వశాస్త్రి, నంబి రాఘవాచార్యులు, బొమ్మకంటి సుబ్బారాయుడు, పెద్దాపురంలోని యంత్రజ్ఞుడు వీరదాసు, స్వయం పాకం తప్ప ఇతరత్రా భోంచెయ్యనని డప్పాలు కొట్టే బులుసు పేరయ్య సోమయాజులు అంతా పూరిగా తెలుగువాళ్ళు. గోదావరి వర్ణన, పిఠాపురం వృత్తాంతం, శంకర మఠాధిపతుల సంచారాలు, వైష్ణవస్వాముల శిష్యసమాశ్రయణ పర్యటనలు ఇవన్నీ ఆనాటి తెలుగుదేశపు సామాజిక వాతావరణాన్నే ప్రతిబింబిస్తున్నాయి

మొదటి ముద్రణ వెలువడ్డ పధ్నాలుగు సంవత్సరాలకు గాని రెండో ముద్రణ వెలువడకపోయినా విద్యావంతులను ఆనాడు ఈ నవల బాగానే ఆకర్షించిందని చెప్పవచ్చు 'రాజశేఖర చరిత్రము ప్రతికాధిపతులచేతను తదితరుల చేతను బహువిధముల పొగడబడెను కాని సామాన్యజనులు దానిని గ్రహింపలేక పోయినందున దానివలన వట్టి పొగడ్తలేకాని రశ్మి యేమియు నాకు కలుగలేదు' అన్నారు పంతులుగారు స్వీయ చరిత్రలో.

వేసవికాలపు శెలవులు సుఖంగా వెళ్ళబుచ్చటానికి తరవాత తరగతి పుస్తకాలు కొనే మిషతో అగ్నిహోత్రావధానును బోల్తాకొట్టించి డబ్బు రాబట్టటానికి గిరీశం గారు వేంకటేశ్వర్లకు అవశ్యం కొనాల్సిన పుస్తకాల జాబితా వ్రాసుకోవోయ్ అని చెపుతూ రాజశేఖర చరిత్రను కూడా చేర్చారు. అంటే గురజాడ అప్పారావు పంతులు గారికి కూడా ఈ నవల నచ్చిందన్నమాట, గురజాడ డైరీలోకూడా రాజశేఖర చరిత్రను మెచ్చుకుంటూ రాసుకున్నారు

అంతర్జాతీయమైన ఖ్యాతిని పొందిన తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్ర మనేచెప్పాలి. ఇంగ్లీషు పత్రికల్లో సమీక్షితమైన మొదటి తెలుగు నవల కూడా ఇదేననాలి. 1887 సెప్టెంబర్ 30వ తేదీ "లండన్ టైమ్స్" సాహిత్యానుబంధంలో రాజశేఖర చరిత్ర ఇంగ్లీషు అనువాదాన్ని గూర్చిన సమీక్షా ప్రశంస వెలువడింది.

## మొదటి ప్రకరణము

ధవళగిరి - దేవాలయవర్ణనము - గోదావరి యొడ్డున నున్న ధర్మశాల మీఁద ప్రాతఃకాలమున రాజశేఖరుఁడుగారు వచ్చి కూర్చుండుట - అప్పుడచ్చటికి వచ్చిన సిద్ధాంతి మొదలగువారి స్తుతివచనములు - అందఱును గలిసి రామపాదముల యొద్దకు బైరాగిని చూడఁబోవుట.

శ్రీ[1]నాసికాత్ర్యంబకముకడ కడుదూరమున నెక్కడనో పశ్చిమమున నొక్కయున్నత గోత్రమున జననమొంది యూర్మికాకంకణాదుల మెఱుంగులు తుఱంగలింపఁ దన జననమునకు స్థానమైన భూభృద్వర పురోభాగముననే పల్లములంబడి జాఱుచు లేచుచుఁ గొంతకాలముండి యక్కడినుండి మెల్లమెల్లగా ముందు ముందుకు ప్రాఁకనేర్చి యెల్లవారల చూపులకు వేడ్కలు నింపుచు, పిదప నవ్యక్తమధుర స్వరంబులతో ముద్దులు గులుకు శరవేగమునఁ బరుగిడుచు, ఆ పిమ్మట ఘనతరుల చెంతఁజేరి తల్లివేళ్ళను విడిచి తక్కిన వేళ్ళనంటుచు బాటి జమ్ములోనడఁగి దాఁగుడుమూఁత లాడుచు, వెలువడి[2]విదర్భాది దేశముల గుండఁ బ్రయాణములుచేసి, త్రోవపొడుగునను వచ్చి పుచ్చుకొనని వారిదే లోపముగా స్నానపానములకు వలయునంత నిర్మల జలం బొసంగి యాబాలవృద్ధ మందఱి నానందమొందించుచు, తా నడుగిడిన చోటులనెల్ల సస్యములకును ఫలవృక్షములకును జీవనములిచ్చి వానిని ఫలప్రదములఁ గావించుచు తన చల్లఁదనము వ్యాపించినంత వఱకు నిరుపార్శ్వములందు భూమినంతను బచ్చని లేఁబచ్చికతో నలంకరించి పశుగణంబుల కాహారంబు కల్పించుచు, తన రాక విని దూరమునుండి బయలుదేఱి యడవిపండ్లును, నెమలికన్నులును వహించి పొంగి నానాముఖములఁ దన్నుఁ గానవచ్చు వరద, మంజీర, పిన్నగంగ మొదలగువారి నాదరించి లోఁగొనుచు, అంతకంతకుఁ దన గంభీరత గానుపింప నాథుని వెదకికొనుచు వచ్చివచ్చి, యీగిరిని దూరమునుండి విలోకించి గోదావరి రసోత్తరంగముగాఁ ఘోషించుచు పాదము

---

1. రాజశేఖర చరిత్రం రచించే నాటికి పంతులుగారి వయస్సు ముప్పై. ఇంచుమించుగా ఇరవైయేళ్ళ వయసు నుంచే ఆయన గ్రంథ రచన ఆరంభించారు. పూర్వ సంప్రదాయం మీద అభిమానం యింకా ఆయన్ను పూర్తిగా వదలలేదు అందువల్లనే శ్రీకారంతో ప్రారంభించారు ప్రారంభ కథన శైలి కూడా ప్రౌఢ గంభీరంగానే వుంది. వర్ణనా సామర్థ్యం కవి ప్రతిభకు తార్కాణం కదా. సమకాలీన పండితులు వీరేశలింగాన్ని గొప్ప కవిగా గుర్తించి గౌరవించారు.

2 గోదావరి మహారాష్ట్రంలోని నాసికాత్ర్యంబకంలో పుట్టింది ఇప్పటి నాగపూర్ ప్రాంతాన్ని పూర్వకాలంలో విదర్భగా వ్యవహరించేవారు.

నంబడి శిఖరంబున నధివసించు జనార్దనస్వామి దర్శనము చేసికొని తోడనే యచ్చట నుండి తన శాఖా రూపములయిన రెండు చేతులను జాచి సరసత మీఱ నాథునిం గలియు భాగ్యము గాంచెనో యీ ధవళగిరి, యాంధ్రదేశమున కలంకారభూతమయి రాజమహేంద్రవర సమీపమున మిక్కిలి వన్నెకెక్కి యుండెను.[1]

ఆ పర్వత మంత యున్నతమయినది కాకపోయినను, తెల్లని పిండిరాళ్ళతో నిండియుండుటచేఁ జూచుట కెంతయు వింతగా మాత్రముండును. ఆ రాళ్ళను బట్టియే దానికి ధవళగిరియను నామము కలిగి యుండును. దక్షిణపువైపునఁ గ్రిందినుండి పర్వతాగ్రము వఱకును నల్లరాళ్ళతోఁ జక్కని సోపానములు కట్టబడి యున్నవి ఆ సోపానముల కిరుప్రక్కలను కొంత పొడుగున నర్చకులయుఁ, దదితరులగు వైష్ణవస్వాములయు గృహములు చాలుగానుండి కన్నులపండువు చేయుచుండును ఆ సోపానముల వెంబడిని బైకిఁ జనినచో గొండమీఁద నల్లరాళ్ళతోఁ గట్టఁబడిన సుందరమైన చిన్న దేవాలయ మొక్కటి కానఁబడును దానిచుట్టును నించుమించుగా నిలువెడెత్తు ప్రాకారము మూఁడుప్రక్కలను బలిసియుండును ఉత్తరపు వైపున మాత్రము గోడకుబదులుగా పర్వతశృంగమే పైకి వ్యాపించి, గోడలు తన పాదము నాశ్రయింప వానిని మించి యాలయశిఖరమును నిక్కి చూచుచుండును ప్రాకారములోపలనె యుత్తరమున నొక చిన్న గుహ కలదు అందులో గూర్చుండి పాండవులు పూర్వ మరణ్యవాసము చేయునప్పుడు తపస్సు చేసిరని పెద్దలు చెప్పుదురు. అందులో నిప్పుడు చిన్న రాతివిగ్రహ మొక్కటి యుండెను సంవత్సరము పొడుగునను పూజాపురస్కారములు లేక బూజుపట్టియున్న యా దేవర నుత్సవ దినములలో నర్చకు డొకఁడు పైకిదీసి పులికాపుచేసి, ఆ స్వామి సన్నిధానమున దీపము నొకదానిని వెలిగించి గుహాముఖంబునఁ దాను నిలుచుండి పల్లెల నుండి యాత్రార్థము వచ్చిన మూఁకలవలన తలకొక డబ్బు[2]వంతునఁ బుచ్చుకొని లోనికిం గొనిపోయి దేవతాదర్శనము చేయించి వారి పెద్దలు ధన్యులయిరని జెప్పి పంపుచుండును. జనార్దనస్వామి కళ్యాణ దినములు నాలుగును వెళ్ళినతోడనే యెప్పటి

---

1. వీరేశలింగం పంతులుగారి మౌలిక ప్రతిభ యీ వర్ణన ద్వారా తెలుసుకోవచ్చు. శ్రీ వివేకవర్ధని పత్రిక ప్రారంభించినప్పుడు వీరేశలింగం ధవళేశ్వరంలోనే ఉండేవారు. 1874 అక్టోబరు నుంచి వివేకవర్ధని మాసపత్రికగా ప్రారంభమైంది. 1878 లో రాజశేఖర చరిత్రం వివేకవర్ధనిలో ధారావాహికంగా మొదలైంది.

2. డబ్బు అంటే ఒక కానీ అణాకు నాలుగు కానులు. రూపాయికి పదహారు అణాలు, అణాకు పన్నెండు పైసలుగా ఆర్థిక వినిమయం వుండేది వీరేశలింగం పంతులుగారి రోజులలో. డబ్బు - A copper coin worth either three or four pies, చిన్నమెత్తు రాగిముద్ర, పాతడబ్బు - A coin worth four pies, కొత్త డబ్బు- a copper coin worth three pies, a quarter anna అని సి.పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో వుంది.

యట్లు స్వామి రథము యొక్క పగ్గముల నందుంచి, వాని కా చిన్నదేవరను గావలి యుంచి జీతబత్తెములు లేకపోయినను రాత్రిందివములుకాలుగదలపక స్థిరవృత్తితోఁ గాచుచుండు నా చిన్నదేవరయెడల గల విశ్వాసముచేత పూజారులు మఱుచటి సంవత్సరపు త్రాళ్ళపని మఱల వచ్చువఱకును ఆ గుహ త్రొక్కి చూడనక్కఱ లేక నిర్విచారముగా నుందురు. ఈ ప్రకారముగ మనుష్యులు భక్తిహీనులయి దేవతాసందర్శనము చేసి కొనకపోయినను పర్వతమును కనిపెట్టుకొనియున్న చిన్న చతుష్పాద జంతువులు మాత్రము మిక్కిలి భక్తికలవై నిత్యము నాస్వామిని సందర్శించుకొనుచు ఉత్సవదినములలో మనుష్యులువచ్చి తమ్ముఁ దఱిమివేయునంతటి పాపముం గట్టుకొన్నదాఁక రాత్రులు దేవతాసన్నిధానమున గుహలో వట్టిభూతలముననే శయనించుచుండును. తూర్పువయిపునఁ బ్రాకారములోనే జనార్దనస్వామి కెదురుగా గొప్ప ధ్వజస్తంభమొకటి యున్నది. దాని శిఖరమున నున్న చిఱు గంటలు గాలికిఁ గదలుచు సదా శ్రావ్యమయిన నాదముతోఁ జెవులను దనుపుచుండును. ఆ స్తంభమునకు మొదట నాంజనేయవిగ్రహ మొకటి చేతులు జోడించుకొని స్వామి కభిముఖమయి నిలిచి యుండును. ఈ శిలా విగ్రహమునకును ధ్వజస్తంభమునకును ఉత్తరముగాఁ గళ్యాణమంటప మొకటి యుండెను. స్వామి కళ్యాణదినములలో నుత్సవ విగ్రహములు నందు వేంచేయింపఁజేసి యథావిధిగా వివాహ తంత్రమంతయు మహావైభవముతో నడిపింతురు.

ప్రతి మాసమును రెండు పక్షములయందును ముఖమంటపము మీఁద ఏకాదశినాడు రాత్రి హరిభజనము జరుగుచుండును. హరిభక్తులు తులసిపూసల తావళములను ధరించుకొని, ద్వాదశోర్ధ్వపుండ్రములను స్ఫుటముగాఁ బెట్టుకొని కరతాళములును మృదంగములును మ్రోగుచుండఁగా దంబురలు మీటుచు, బిగ్గరగాఁ దమ యావచ్ఛక్తిని "నవనీతచోరా" "గోపికాజారా" "రాధికాలోలా" "గోపాలబాలా" మొదలగు నామములచే నిష్టదేవతలను సంబోధించుచు మధ్య మధ్య గొంతుకలు బొంగుపోయినప్పుడు మిరియములను బెల్లపు ముక్కలను నములుచు కృష్ణలీలలను పాడుచుందురు తలలు త్రిప్పుచు భక్తులు తమ సత్తువంతయుఁ జూపి చేతికొలఁదిని వాయించుటచే నొకానొకప్పుడు మద్దెలలును తాళములును పగిలిపోవుటయు సంభవించుచుండును. దేవతావేశముచేత తఱుచుగా భక్తులలో నొకఱిద్దరు దేహములు పరవశమయి రెండు మూడు నిముషముల వఱకు వెనుకకు స్తంభముమీఁది కొఱగుచుండుటయుఁ గలదు. ఇట్టి భక్తిమార్గమును బొత్తిగా గుర్తెఱుఁగని యన్యదేశీయులకు మాత్రము వచ్చిన జనులు వారెంత వికృతముగా కేకలు వేయుచు భజనచేయుదురో యంత పరమభాగవతోత్తములని తలఁతురు

కొంచెము శ్రమపడి యెవ్వరైన మధ్యాహ్నవేళ నొక్కసారి కొండమీఁదికెక్కి నలుఁగడలఁజూడ్కి నిగిడించినచో, వన్నెవన్నెల పిల్లలు చెంగు చెంగునఁ మనుందఱ దుముకులాడుచుండఁ గొండ పొడుగునను, ముంగాళ్లు మీఁదికెత్తి

పొదలపయి యాకులను మేయు మేఁకలును, పూర్వదక్షిణములఁ గుప్పనోసినట్లున్న తాటాకుల యిండ్ల నడుమ వానిని వెక్కిరించునట్లక్కడక్కడ నెత్తుగా నొక్కొక్క పెంకుటిల్లును, ఉత్తరమున మంచెలపైనుండి పొలముకాఁపులు కోయని కూఁతలిడుచు నొడిసెలలు ద్రిప్పుచు బెదిరింపఁ జేనువతోఁపులలో నుండి వెలువడి మధురరుతములు చేయుచు ఆకాశమున కెగయుచు సందయినప్పుడు కంకులను విఱుచుకొని పఱచి పలువిధములయిన పక్షులు చెట్లకొమ్మలమీఁదఁ బెట్టుకొని తినుచుండ ముచ్చటగా నుండు పలువిధముల పచ్చనిపయిరులును, ఆ పయిని వృక్షములమీఁదను గూర్చుండి కర్ణరసాయనముగాఁ బిల్లనగ్రోవిని మోవినిబూని పాడెడి గోపబాల కులగానములకు హృదయములు కరఁగి, మేపులు చాలించి, క్రేపుల తోడఁగూడఁ జెవులు నిక్కించి యఱ్ఱులు చాచియాలింపుచు నడుమ నడుమ గడ్డిపఱకలు కొఱుకుచుబయళ్ళయందు నిలుచున్నపసుగణములును, పడమటను నీలములవలెనున్న తేటనీటిపై సూర్యకిరణములు పడియెల్లెడలను వజ్రపుఁదళుకులను బుట్టింపఁ బలు తెఱంగుల జలవిహంగంబులు పుట్టచెండ్లవలె మీలఁ బట్టుకొనుటకయి నీటం బడుచు లేచుచుఁ బ్రవాహంబుతోడం బఱచుచుండ నఖండగౌతమియు నేత్రోత్సవము చేయుచుండును

ఆ పర్వతపాదమునకు సమీపమున గోదావరియొడ్డున నల్లరాతి బండమీఁదఁ జక్కఁగా మలఁచిన రామపాదములు వెలసి యున్నవి శ్రీరాములవారు పూర్వకాలమున సీతాలక్ష్మణులతోడఁగూడఁ బర్ణశాలకుఁ బోవుచు త్రోవలో ఈ పర్వత సమీపమున నడచిననాటి పాదముల చిహ్నములే యవి యని యెల్లవారును నమ్ముదురు.[1] కాఁబట్టి యా రామపాదములను సందర్శింపవలె నను నభిలాషతో దూరదేశములనుండి సహితము యాత్రాపరులు వచ్చి రామపాదక్షేత్రమున నఖండ గౌతమీస్నానము చేసికొని, కొండమీఁది కెక్కి శ్రీ జనార్ధనస్వామివారి దర్శనము చేసికొని, స్వశక్త్యనుసారముగా దక్షిణతోడి ఫలములను సమర్పించి కలిగినవారైన స్వామికి భోగముసహితము చేయించి మఱి పోవుచుందురు అది దివ్యక్షేత్ర మగుటం జేసి జాతి మతభేదములు లేక యెల్లవారును పులియోగిరము దధ్యోదనము మొదలుగాఁ గల స్వామి ప్రసాదమును స్వీకరించి కన్నుల కద్దుకొని యచ్చటనే యారగించి చేతుల నంటుకొన్నదానిని కడుగుకొన్న నపచారమగును గనుక గర తలములు పయికెత్తి చేతుల కందినంతవఱకు దేవాలయ స్తంభములకును గోడలకును వర్ణము పేయుటయేకాక తచ్ఛేషముతోఁ దమ మీఁజేతులకును బట్టలకును మెఱుఁగు పెట్టుకొనుచుందురు

ఈ కొండకుదక్షిణమునను తూర్పునను కొంతదూరమువఱకు గ్రామము వ్యాపించి యున్నది పర్వతముపేరే పూర్వము గ్రామము నకుంగూడఁ గలిగియుండెను.

---

1 "ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతమ్మవారు స్నానమాడని గుంటలూ లేవు" అని గురజాడ అప్పారావు "మీ పేరేమిటి?" అన్న కథలో ప్రసక్తం చేయడం జ్ఞాపకం వస్తుంది వీరేశలింగం పంతులుగారి యీ వర్ణన చదివినప్పుడు.

కాని, యిప్పుడిప్పుడు గ్రామమును ధవిళేశ్వరమని వ్యవహరించుచున్నారు. కొండ మీఁదినుండి సోపానములు దిగవచ్చినతోడనే రాజవీధియొక్క యావలిప్రక్కను శ్రీ అగస్త్యేశ్వరస్వామివారి యాలయ మొక్కటి లోచనగోచరం బగును. తొల్లి వింధ్య పర్వతము యొక్క గర్వము నణఁచి దక్షిణాభిముఖుఁడయి చనుచు అగస్త్యుం డా స్వామిని అచట ప్రతిష్ఠ చేసెనని స్థలపురాణము చెప్పుచున్నది. ఈ దేవాలయ మునకును, పర్వతమునకును మధ్యను తూర్పునుండి పడమటికి గోదావరి వఱకును విశాలమయిన రాజవీధి యొకటి గలదు. ఆ వీధి చివరను నల్లరాళ్ళతో నీటివఱకును సోపానములు కట్టఁబడియున్నవి సోపానములకు సమీపమున వీధికిఁ దూర్పు ప్రక్కను "ధర్మచావడి" అని యొకటి యుండెను అది పరదేశ బ్రాహ్మణులును, మార్గస్థులును రాత్రులు పరుండుటకై మొట్టమొదట కట్టఁబడినది కాని, ఆ కాలమం దది యుబుసుపోవుటకై గ్రామములోని పెద్ద మనుష్యులు ప్రతిదినమును ఉదయాస్తమయ సమయములయందు బ్రోగై యిష్టకథాగోష్ఠిం గొంత ప్రొద్దుపుచ్చి పోవుచుండుటకు మాత్రము వినియోగపడుచుండెను

ఒకానొక దినమున సూర్యుఁడుదయించి ప్రాచీముఖంబునఁ గుంకుమబొట్టు నందంబు వహించి వృక్షాగ్రములను బంగారు నీరు పూసినట్లు ప్రకాశింపఁ జేయుచుండెను చెట్లమీఁది గూళ్ళనుండి కలకల ధ్వనులతో వెలువడి పక్షులు నానా ముఖముల ఎరకయి వెడలుచుండెను పసులకాపరిబాలురు చలుదులు మూటగట్టుకొని పశువుల మందలను దోలుకొని పచ్చికపట్లు కరుగుచుండ, వెనుక "వెల్లావు కడినాది" "దోరగేదె కడినాది" యని గంపలు చేతఁబట్టుకొని, పడుచు లొండొరుల మీఁద పరుగులిడుచుండిరి; కాఁపులు ములుకోలలు బుజములమీఁదఁ బెట్టుకొని, కోజేరులను దోలుకొని తమ తమ పొలములకుం బోవుచుండిరి;[1] అప్పుడు కాయ శరీరముగల యొక పెద్ద మనుష్యుఁడు జందెము పేరుగా వేసికొని యెడమచేతితో నిత్తడి చెంబు నొకదానిం బట్టుకొని, గోదావరిలోఁ గాళ్ళను చేతులును గడుగుకొని, ఒడ్డునకు వచ్చి పుక్కిలించివైచి యజ్ఞోపవీతమును సవ్యముగా జేసికొనివచ్చి, ధర్మశాలమీఁద నొడ్డున గూర్చుండి, వచ్చునప్పుడు చెంబులో వేసి తెచ్చుకొన్న తుమ్మపుడకతో దంతధావనము చేసికొనుచుండెను ఆతనకు వయస్సు నలువది సంవత్సరము లుండును; మొగముమీఁద స్ఫోటకమచ్చ లేకపోయెనేని, మొగము సుందరమయిన దనుటకు సందేహింపనక్కఱ యుండదు అట్లని, యా ముఖ మాయనను నిత్యమును దర్శింపవచ్చు ప్రవక్తలస్తోత్రములకు మాత్రమెప్పుడును బాత్రము కాకపోలేదు. శరీరచ్ఛాయ యెఱ్ఱనిది. విగ్రహము కొంచెము స్థూలముగాను పొట్టిగాను

---

1 మాలపల్లి నవలలో కూడా మొదటిభాగం ఆరవ ప్రకరణం–'గొడ్లుకాపడులు' అనే పేరుతో ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు గ్రామీణ జీవిత సౌందర్యాన్ని వర్ణించారు.

ఉండును. నుదురు విశాలమయి చూచువారి కాతఁడు పండితుఁడని తోఁపఁజేయుచున్నది. అప్పుడు కట్టుకొన్నది గోరంచు నీరుకావి ధోవతి, సరిగంచుల చలువ వస్త్ర మొకటి శిరస్సునకు వదులుగా చుట్టఁబడి కొంగు కొంత వ్రేలాడ వేయఁబడి యున్నది; చెవులనున్న రవలయంటుజోడును, కర్మిష్ఠుఁడనుటకు సాక్ష్యమిచ్చుచున్న కుడిచేతి యనామికయందలి బంగారపు దర్భముడి యుంగరమును, తర్జనియందలి వెండి బటువులు రెండును దప్ప శరీరమున నాభరణము లేవియు లేవు. ఆయన పేరు రాజశేఖరుఁడు; ఆయన ముఖప్రక్షాళన మగునప్పటికి గ్రామములోని గృహస్థులు నలుపురును అక్కడికి వచ్చి, ఆయన వారి వారి తారతమ్యముల కర్హముగాఁ దగిన మర్యాదలు చేసి కూర్చుండుఁ డని చేయిచూప, 'చిత్తము' 'చిత్తము' 'మీరు దయ చేయండి' అనుచుఁ జావడిలోఁ గిటగిటలాడుచుఁ గూరుచుండిరి

అప్పుడు రాజశేఖరుఁడుగారు "సిద్ధాంతిగారూ! మీరు నాలుగు దినములనుండి చొత్తిగా దర్శనమిచ్చుట మానివేసినారు! మీ యింట చిన్న పెద్దలందఱును మతే మియు లేకుండా సుఖముగా నున్నారుగదా?"

సిద్ధాంతి — "చిత్తము చిత్తము తమ యనుగ్రహమువల్ల మే మందరము సుఖముగానే యున్నాము; ఎన్ని కుటుంబములనైన నన్న వస్త్రాదులిచ్చి కాపాడఁగల ప్రభురత్నములు తమరు గ్రామములో నుండఁగా మా వంటివారి కేమి కొదువ. మా గ్రామము చేసికొన్న భాగ్యముచేతను, మా పురాకృత పుణ్యముచేతను, తమ వంటి దాన కర్ణులు మా గ్రామమునకు విజయంచేసినారుగాని మరియొకటి కాదు" అని రామశాస్త్రిగారి వంకఁ దిరిగి, "మనము వారి ముఖము ముందట స్తుతి చేయ వలసినది కాదు గాని, రాజశేఖరుడుగారు కేవలము నీశ్వరాంశ సంభూతులు సుండీ!"[1]

ఆ మాటల కాదరమును సూచించెడి మందహాసము చేసి రామశాస్త్రి "అందుకు సందేహమేమి? ఈసంగతి మీరు నాతోఁ జెప్పవలెనా! వారి గ్రామమున నుండఁబట్టి మన మందఱము వారి యండను నిలువగలిగినాము గాని, లేని యెడల నిండ్లను, వాఁకిళ్లను విడిచిపెట్టి మన మీ పాటికి దేశములపాలయి లేచి పోవలసినవారము కామా! వారి తండ్రిగా రిక్కడికి వచ్చినప్పటినుండి యిది యొక

1. రాజశేఖరుడు పాత్ర చిత్రణలో వీరేశలింగం పంతులుగారి తాతగారైన వీరేశలింగంగారి వ్యక్తిత్వాన్ని దృష్టిలో పెట్టుకొన్నట్లు కనపడుతుంది "ఇట్లు మహోన్నత దశలో నున్న కాలము నందాయన పూర్వార్జితములయిన భూములను జాతులకు గొన్నిటిని విడిచిపెట్టి తక్కిన వానిని విద్వాంసులకు దానము చేసెను" అని తాతగారిని గూర్చి వర్ణించారు స్వీయ చరిత్రలో. పుట 9 - 1982 ముద్రణం.

గ్రామముగాఁ గనఁబడుచున్నదిగాని యింతకుఁ బూర్వము దీనికి నామరూపము లున్నవా ?" [1]

అని మంచి సమయము తటస్థించినప్పుడు తన పాండిత్యమును దాఁచి పెట్టక, అందుకొని సిద్ధాంతిగారి స్తోత్రపాఠములకు సాయముగాఁ దనవి కూడ నాలుగు కలిపెను.

అప్పుడు రాజశేఖరుఁడుగారు మనసులో మిక్కిలి సంతోషించినను పయి కా సంతోషము కానరాకుండ నడఁచికొని "సిద్ధాంతిగారూ! మొన్న మీ రెందవచిన్నదాని కేమో గ్రహబాధ కినఁబడ్డట్టు విన్నాను. కొంచెము నిమ్మళముగా నున్నదా?"? [2]

అని యడిగిన తోడనే సిద్ధాంతిగారు మోమున దీనభావము గానిపింపఁ గొంచె మాలోచించి తలయూఁచి "జోస్యుల కామావధానులగారి చేత విభూతి పెట్టించు చున్నాను. కాని, దానివల్ల నిప్పటి కేమియు గుణమే కనఁబడలేదు జాతకరీతిచే దాని కిప్పుడు శని చాలదు ఎందుకైనను మంచిదని నా తమ్మునిచేత నవగ్రహ జపము చేయించుచున్నాను అంతతో నూరకుండక కామావధానులుగారిచే 'పంచముఖి వీర హనుమంతము' పునశ్చరణ చేయవలసినదనియు, జపశాంతి కేమయినఁ గావ లసియున్న ఏ రాజశేఖరుఁడుగారినైన కాళ్ళో కడుపో పట్టుకొని తెచ్చి నాలుగు రూపాయల సొమ్మిచ్చుకోనైన నిచ్చుకొనియెద మంచి విభూతి పెట్టుమనియు ఆయన ననుసరించి బతిమాలుచున్నాను. అందుచేతనే యీ నాలుగుదినములనుండి దర్శ

---

1. తమ తాతగారైన వీరేశలింగాన్ని గూర్చి పంతులుగారు స్వీయచరిత్రలో ఇట్లా చెప్పారు.

"మా తాతగారి జన్మభూమి యేలూరు. అక్కడనే వారికి బూర్వార్జితము లయిన భూములును గృహములును నుండెను. మా యింటి పేరునుబట్టి మా పూర్వులాది యందు నెల్లూరు మండలములోని కందుకూరు పుర నివాసులయి యుండినట్టును అటు తరువాత మహమ్మదీయుల కాలములో నుద్యోగ ధర్మమును బట్టి యేలూరునకు వచ్చినట్టును తెలియు చున్నది.

...భూముల యాదాయమును నమ్ముకొని స్వస్థలమునందే యుండుట కవకాశము లేక మా తాతగారు రాజాశ్రయమును బొంది స్వగ్రామమును విడిచి రాజమహేంద్రవరమునకు వచ్చి కొంతకాలమున కక్కడ మిక్కిలి ప్రబలులయి విశేష ధనార్జనము చేసి రాజ భవన మును దగినంత మహాసౌధమును గట్టి యచ్చటనే స్థిర నివాస మేర్పరచుకొనిరి "

2. "ఆ కాలము నందెల్ల వారికిని దయ్యముల యందలి విశ్వాస మత్యధికము. స్త్రీలలో నొకప్పుడును దయ్యము పట్టని వారెక్కడనో యుండిరి. ఎవ్వరికే వ్యాది వచ్చినను వైద్యుని ఇంటికి మారుగా భూత వైద్యుని యింటికో సోదె చెప్పువాని యింటికో పరుగెత్తుచుండిరి".

— స్వీయ చరిత్రము మొదటి భాగం

మొదటి ప్రకరణం పుట 11

నము చేయలేదుగాని లేకపోయిన నేది యెట్లయినను నేను తమ దర్శనము మాను దునా ?" అనెను.

మొదటి భాగం, మొదటి ప్రకరణం;
——పుటలు 8, 9 – 1982 ముద్రణం

రాజ — "శాస్త్రిగారూ ! మీరు రూపాయల నిమిత్తము సంశయపడ నక్కఱ లేదు. కావలసియున్న ఆ నాలుగు రూపాయలను నే నిచ్చెదను. మఱి నాలుగు రూపాయలు పోయినను మంచి వైద్యుని విచారింపవలెను మన గ్రామములో కామావధానులుగారికన్న —" అని మిన్నువంకఁ జూచి యేమో యాలోచించుచుండెను. సిద్ధాంతిగారు చేసినస్తుతి యమోఘముగాఁ బట్టుకొని కొంచెముగానో గొప్పగానో ధనరూపమైన ప్రతిఫలమును దెచ్చుచునే వచ్చుచున్నదిగాని, యీవఱకెన్నఁడును రాజశేఖరుఁడుగారివద్ద వ్యర్థముగాఁ బోలేదు

ధవళేశ్వరమునందును, చుట్టుపట్టుల గ్రామములయందును వేఱు సిద్ధాంతి లేఁడు గనుక, ఆయన యింటికి వచ్చి వర్జ్య మెప్పుడని కాని, ప్రయాణమునకు ముహూర్తము పెట్టుమనికాని, క్రొత్తబట్ట చించి కట్టుకొనుట కేదినము మంచిదని కాని, ఇల్లు కట్టుకొన నారంభించుట కేమాస మనుకూలమైనదనికాని, క్షౌరము చేయించుకొనుట కేవారము మంచిదని కాని, వివాహమునకు లగ్నము పెట్టుమని కాని, రజస్వల యయినప్పుడు నక్షత్రము చెప్పుమని కాని సదా యెవ్వరో యొక రాయన నడగి పోవుచునే యుందురు దూరబంధువులు పోయినప్పుడు మైల యెంతి కాలము పట్టవలెనో తెలిసికోవలె నన్నను, జబ్బు నక్షత్రమున నెవ్వరైన మృతి నొందినప్పుడు ఇల్లువదలి యెంతకాలము లేచిపోవలెనో కనుగొనవలెనన్నను రోహిణ్యాది నక్షత్రములయందు బిడ్డను గన్నప్పు డేమిశాంతి తగులునో యెఱుఁగ వలెనన్నను సిద్ధాంతి యొద్దకు రాకసరిపడదు ఏ కాఁపువాని పశువు తప్పిపోయినను ఎవనింట ఏ వస్తువు పోయినను వచ్చి సిద్ధాంతిగారి నడుగకపోరు ఇటువంటి సమయములయం దెల్లను, అతఁడు వీధినడవలో నేలమీఁద ఇసుకపోసి దానిలో పూచికపుడకతో ఏమేమో బీజాక్షరములును అంకెలును వ్రాసి మీఁదివంక చూచి యాలోచించి వచ్చినకార్య మిది యనియు, కార్య మీప్రకారముగా జరుగుననియు చెప్పి పంపుచుండును అతఁడు బల్లిపాటు మొదలైనవాని ఫలములును,[1] శకు

---

1 బల్లిపాటుకు ఫలమిట్లా వుంటుందని
పెద్ద బాలశిక్షలోను, పంచాంగంలోను
ఆయా వివరాలు కనపడతాయి.

"శిరస్సు – కలహం, ముఖం – బంధు దర్శనం, కనుబొమ్మల నడుమ రాజానుగ్రహం, పై పెదవి – ధన వ్యయం, క్రింది పెదవి-ధన లాభం" ఇత్యాది.

దీన్ని గౌళి శాస్త్రం అని కూడా అంటారు.

ములు చూచి సంతానము కలుగు కాలమును గూడ చెప్పుచుండును. వేయేల? సిద్ధాంతి యాలోచన లేక యా చేరువగ్రామములలో ఏ శుభకార్యము గాని యశుభ కార్యముకాని జరుగదు అతఁడు చెప్పెడి జ్యోతిషము తఱుచుగా అబద్ధమే యగుచు వచ్చినను, అప్పుడప్పుడు కాకతాళీయముగా కొన్ని సంగతులు నిజమగు టయుఁ గలదు గనుక జనులాతనిమాట యమోఘమని నమ్ముచునే యుండిరి

అప్పు డా చావడిలో నున్నవారిలో నెవరో "బైరాగులు భూత వైద్యము నకు గటివా"రని మెల్లగా ననిరి అంతలో రాజశేఖరుఁడుగారు సిద్ధాంతిగారివంకఁ జూపు ద్రిప్పి "ఔను, బైరాగులన్న తోడనే జ్ఞప్తికి వచ్చినది. పది దినముల క్రిందట ఈ గ్రామమున కెవ్వడో యొక బైరాగి వచ్చినాఁడట! అతనికిఁ జూపింప రాదా? గోసాయీలకుఁ బరమహంసక్రియలును, వనమూలికలును విశేషముగాఁ దెలిసియుండును.వాండ్రెట్టి యసాధ్యమైన పీడలనైనను జిటికెలలోఁ బోగొట్టుదురు" అనినతోడనే చావడి యంతయు 'చిత్తము' 'వాస్తవము' 'అలాగున నవశ్యము చేయవలసినదే'యను ధ్వనులతో నిండిపోయెను మాటలాడువారు ధనవంతు లైనచో, వ్యర్థవచనము సహితము స్తుతియోగ్యము కాకపోదునుండీ ఆ మాటల వలన నుత్సాహము కలిగి, రాజశేఖరుఁడుగా రా బైరాగిని తాము చూడకపోయినను బ్రహ్మవర్చస్సు కలవాఁడని శ్లాఘించిరి

అంత సిద్ధాంతి యుల్లములో లేని సంతోషమును మోమునఁ దెచ్చిపెట్టుకొని యొక్క చిఱునవ్వు నవ్వి, వినయముతోఁ చేతులు జోడించి రాజశేఖరుఁడుగారి ముఖమున దృష్టినిలిపి, "తమమాట చేతనే మా చిన్నదాని బాధ నివారణ మయినది. ఈయదృష్టము బాగుండఁబటియే దేవరివారి ముఖః నుండి యీ మాట వచ్చినది.

---

అయితే ఇక్కడ 'పాటు'గాదు. ఆ బల్లి చేసే ధ్వనులనుబట్టి ఆయా శకునాల శుభా శుభాలు నిర్ణయించడం జరిగేది.

గౌళి - శకునములు చెప్పే బల్లి, A kind of lizard called by naturalist Monitor from in chirping note అని సి. పి. బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు

"ఈకాలము నందు జ్యోతిశ్శాస్త్రములోని,
ముహూర్త జాతక భాగముల యందును,
శకునములు మొదలైన వానియందును
గూడ నాకు విశ్వాసము సంపూర్ణముగా చెడినది.

స్వీయ చరిత్రము మొదటి భాగము, మూడవ ప్రకరణము.
పుట. 51 - 1982 ముద్రణ.

వీరేశలింగంగారి కప్పటికి 24 సం॥ ల వయస్సు తరవాత 6 సం॥ లకు రాజశేఖర చరిత్ర రచించారు.

ఇప్పుడే తమ సెలవు ప్రకారము బైరాగియొద్దకు వెళ్ళెదను." అని మనవిచేసి, ప్రయాణోన్ముఖుఁడయి లేచి నిలువఁబడెను. రాజశేఖరుఁడుగారి యభిప్రాయము కొంచెము తెలిసినతోడనే బైరాగిమహానుభావుఁ డనువారును, మహా మంత్రవేత్త యనువారు, వాయుభక్షణము చేయుననువారును, మండువేసవిని పంచాగ్ని మధ్యమునఁ దపస్సు చేయు ననువారును అయి సభ యంతయు అతని విషయమైన స్తుతిపాఠములలో మునిఁగిపోయెను. ఒక గొప్పవాఁడొకనిని మంచివాఁడన్నచో, ఎవ్వని వాక్కు భిన్నముగా లేచును? ఎవ్వని నోరు స్తుతి వాక్యముల కొఱకు తడవుకొనును?

అప్పుడు రాజశేఖరుఁడుగారు వీధివంకఁజూచి "ఎవ్వరో స్త్రీలు నీళ్ళకు వచ్చి మనలఁజూచి సిగ్గుపడి వెనుకకునాలుగడుగులు పెట్టి నిలుచుండి యొండొరులమొగముల వంకఁజూచుకొనుచున్నారు. మనమందఱమును లేచి బైరాగిని జూచివత్తమురండి." అనుమాట తోడనే ఎల్లరును లేచి ప్రయాణోన్ముఖులయి నిలుచుండిరి. వెంటనే యందఱును గలిసి యుత్తర ముఖముగా రామపాదములవైపునకు నడవ నారంభించిరి

# రెండవ ప్రకరణము

రాజశేఖరుఁడుగారి కూఁతురు రుక్మిణి స్నానమునకు వచ్చుట - నదీతీర వర్ణనము - రుక్మిణికిని సిద్ధాంతిగారి భార్యకును జరిగిన సంభాషణ - నీళ్ళకు వచ్చిన యమ్మలక్కల ప్రసంగములు - పంచాంగపు బ్రాహ్మణుఁడు వచ్చి సంకల్పము చెప్పుట - రుక్మిణి స్నానముచేసి బయలుదేఱుట.

రాజశేఖరుఁడుగారు పౌరబృందముతో నాలు గడుగులు ముందుకు సాగిన తోడనే యొకసుందరి సుందరగమనముతో బాదముల యందలి యందియల మ్రోత మట్టియల మ్రోఁతతోఁ జెలిమి సేయ, మొలనున్న వెండి యొడ్డాణము యొక్కయు ముంజేతుల పసిడికంకణముల యొక్కయు, గాజులయొక్కయు కాంతులు ప్రతిఫలించి కుడిచేతిలోని తళతళ లాడుచున్న రాగి చెంబునకుఁ జిత్రవర్ణ మొసంగ, మోమున లజ్జాభయములు నటియింప, పయ్యెద చక్కఁజేర్చుకొనుచు తిన్నగాఁ దలవంచుకొని మెట్లుదిగివచ్చి చెంబును నీటియొడ్డున నుంచి చెంబుమూతి కంటించి యున్న పసుపుముద్దను దీసి కొంత రాచుకొని మోదుగాకులోఁ జుట్టి తెచ్చికొన్న కుంకుమపొట్లము నొక బట్టయుతుకు రాతిపయిం బెట్టి, మోఁకాలి బంటినీటిలో నిలుచుండెను. ఆమె రాజశేఖరుఁడుగారి పెద్దకూఁతురగు రుక్మిణి- ఆహా! ఆమె సౌందర్యమును బ్రత్యక్షమునఁ జూడ నోచినవారికన్నులే కన్నులు. ఆ కాలమున హిందూ దేశమునందలి సుందరులలో నెల్లఁ దెనుఁగు దేశములోనివారే రూపరేఖా విలాసములచేత నసమానులుగా నుండిరి.[1] వారిలోను బ్రాహ్మణజాతినాతులు మిక్కిలి చక్కనివారు. కాని, రుక్మిణి రూపమును దలఁచినప్పుడు మాత్రము, ఆ సుందరులొక సౌందర్యవతులని చెప్పుట కెల్లవారును సంకోచపడుచుందురు జనులందఱును మిక్కిలి సౌందర్యవతులని యొప్పుకొన్నవారిలో చక్కనివారి నేఱి యామె చెంత

1. వీరేశలింగం పంతులుగారికి తెలుగు తనం పైనా, తెలుగు దేశంపైనా చాలా అభిమాన ముండేది.

"నే నఱవ దేశమునందును కన్నడదేశము నందును సంచారము చేసినప్పుడక్కడివారు సంఘ సంస్కారాది విషయములలో తమ దేశముల కంటె తెలుగు దేశమెక్కువ యభివృద్ధి పొందినదని చెప్పుకొనుచుండగా నేను పలుమాఱు విని యాంధ్రదేశము యొక్క యభ్యున్నతి కానందించి గర్వపడుచువచ్చినాడను" స్వీయ చరిత్రము-రెండవ భాగము, నాలుగవ ప్రకరణము, పుట 306-

(ద్వితీయ భాగం ముద్రణం 1984)

పిలిచినచో గుఱ్ఱపురాంద్రనిపించెడు యామె మనోజ్ఞత నేమని పిలువవలెనో తెలి
కున్నది. అపూర్వ వర్ణనా సామర్థ్యముగల కాళిదాసాది కవులలో నొకరినై
బోలఁజాలని నేను, ఉన్నత సౌందర్యమును బోధించు పదములు నే-
పదములు బోధించునంత వఱకైనఁ బూర్ణముగా దెలుపలేని బ [illegible]
బూనుట యామె చక్కఁదనముయొక్క గౌరవమునకుఁగొఱఁత గలుగఁజేయుటయే
గదా! అయినను యోగ్యవస్తువు దొరికినపుడు వర్ణింపం బూనుట యుచితము
కాదు కాఁబట్టి, యీ సృష్టిలోని వస్తువులతో వేనితోనైనను పోల్చి యీ పుస్త
కముం జదువువారి కామె యవయవముల యొక్క రూపము నించుక మనస్సున
బుట్టించుటకున్నను ఆమె యంగముల నెంచి యావస్తువుల పేరు చెప్పుటకే సిగ్గు
వొడముచున్నది వేయేల? చతుర్ముఖుఁడును ఘుణాక్షరన్యాయమునఁ బడినయా
రూపమునకుఁ దలయూఁచి, తన యపూర్వ వస్తునిర్మాణ చాతురిని మెచ్చుకో
బోఁడని యామెంజూచిన వారెల్లరు నెంచుచుందురు ఆమె శరీరచ్ఛాయం జూచి
ఇఁక నీ భూమిమీఁద బంగారమున కేమిచాయ యెక్కువగలదని తోఁచును; నల్ల
నుండు నేని, విండ్లామెకనుబొమలం గొంచెము పోలియున్నవని చెప్పవచ్చును
నేత్రములను జూచిన భాగ్యదేవత వానియందే కాఁపురము కుదిరినట్టు కనిపించును;
కాని,నిపుణముగాఁ బరిశీలించినచో నేదో స్థిరవిచార మొకటి యామె హృదయసీరమున
నెలవుకొనియున్నట్లు ముఖలక్షణములు కొంచెముసూచించుచున్నవి ఆవిచారమునకు
గారణము లేకపోలేదు; ఆమె పెనిమిటి సహవాస దోషముచేత నాఱునెలల క్రిందట
దలిదండ్రులతోఁ జెప్పక దేశాంతరము లేచిపోయినాఁడు

ఇప్పుడామెకుఁ బదునాలుగు సంవత్సరముల వయస్సు గలదు బంగారము
నకుఁ బరిమళ మబ్బినట్లు, ఇప్పు డిప్పుడే యౌవనము తలచూపి యామె మేని
సోయగమునకు మెఱుఁగు దెచ్చుచున్నది. పచ్చని దేహముమీఁద అప్పుడు కట్టు
కొన్న తెల్లనిబట్టయు బంగారమునకు పటిక పూసినట్టు లోకవిధమయిన యందమునే
కలిగించుచుండెను సుందరాంగుల యంగముం జేరినప్పు డేది యందముగా
నుండదు? ముక్కున నడబాసయు, చెవుల నీలాలబావిలీలును, చేతుల కంకణము
లును, మెడలో పట్టెడయును, మొలను వెండియొడ్డాణమును, కాళ్ళ నందెలును
మట్టెలును ఆమె యప్పుడు ధరించుకొన్నది కంకణములకు సాహాయ్యముగా
రంగురంగుల గాజులును లక్క పట్టులును ముంజేతుల నలంకరించుచుండును
ఈ నగలచే నామె యవయవముల కేమైన శోభ కలిగినదో లేదో కాని యవయ
ములచే నగలు కొంత శోభగాంచుట మాత్రము కరతలామలకముగాఁ గనఁబడు
చున్నది

సృష్టిలోని యే పదార్థమునకును పరిపూర్ణత్వమును దయచేయనిరీతిచే,
సర్వసముఁడగు భగవంతుడు రుక్మిణి సౌందర్యమందును గొంత కొఱంతను
గలిగించినాఁడు కాని బొత్తిగాఁ గలిగింపక మానినవాఁడు కాఁడు నిజముగా అది

కొంతయే యయ్యెనేని యామెకుంగల లోపమెల్లను మెడ మిక్కిలి
గా నుండుట, అయినను పుష్టి సర్వశాస్త్రి యాయవారమునకుఁ వచ్చినప్పు
నుజూచి సంతోషించి, "మిక్కిలి నిడుదగు మెడకామిని కులవర్ధని
... ...నిరి బుధుల్॥" అను సాముద్రిక గ్రంథములోని పద్యమును
దివి పోవుచుండును.

అప్పుడొక్క విధవ మొలలోఁతునీళ్ళలో దూరముగా నిలుచుండి నోటిలో
మేమో జపించుకొనుచు నడుమనడుమ దలయెత్తి సూర్యుని వంకజూచి దండ
ములు పెట్టుచు, దోసిటలో నీళ్ళుపట్టి సూర్యున కర్ఘ్యము విడుచుచు, అప్పుడప్పుడు
ప్రదక్షిణములు చేయుచుండెను. ఆవలనే వచ్చియున్న కొందఱు స్త్రీలు తమ
తడిబించెలను నీళ్ళలోఁబెట్టి రేవునకు సమీపముగానున్న రాళ్ళపయిని నిలుచుండి
క్కొక్క పెట్టువేయుచు మధ్యమధ్య నొక్కొక్కమాట చెప్పుకొనుచు బటల
తెంకుకొనుచుండిరి. ఒక వృద్ధాంగన సగముబట్ట కటుకొని తక్కిన సగము
ఏకుకొన్న తరువాత, ఉతికినభాగము మార్చి కట్టుకొని మిగిలియున్న భాగము
ఏకుకొనుచుండెను. కొందఱు వయసులోనున్న స్త్రీలును గోప్యముగా నుంచఁ
గిన తమ యవయవములు స్నానము చేయుచున్నట్టియు గట్టున నున్నట్టియు
పురుషులకుఁ గనఁబడునట్లు సిగ్గువిడచి లోదుగుకొన్న రవికలను దీసి యుదుకుటకయి
తాము కట్టుకొన్న వస్త్రముల నక్కడనేవిచ్చి యావల కుదికిన వేఱు తడిబట్టలను
మటఁబెట్టుకొనుచుండిరి. ఆవల పదిబారల దూరమున దాసీజనములు క్రిందఁబడిన
మెతుకులకై కావు కావని మూఁగిన కాకులను చేయెత్తి యదలించుచు అంటుతప్పెల
లను ఒడునఁ బెట్టుకొని తోముకొనుచుండిరి. ఆపయిని బెస్తలు పుట్టగోచులతో
మొలబంటినీటిలో నిలుచుండి వలత్రాడు మొలత్రాడునం దోపుకొని రెండుచేతుల
తోను వలను త్రిప్పి లోఁతునీళ్ళలో విసరివైచి మెల్లమెల్లగా లాగుచుండిరి. మఱి
కొందఱు లాగిన వలను నీళ్ళలోఁ బలుమారు జాడించి యంటుకొనియున్న బురద
పోయిన తరువాత గట్టునకుఁ దీసికొనివచ్చి చివర దగిలించియున్న యినుపగుండ్లు
లగలలాడ వలలను విప్పి రాయిరప్ప క్రిందఁ బాఱవైచుచు నడుమనడుమ వల
న్నులసందున నుండి మిట్టిమిట్టిపడు చిఱుచేపలను చేతులతో నదిమిపట్టి మీలబుట్ట
ను చేతఁబట్టుకొని నిలుచున్న పిన్నవాండ్రచేతి కందిచ్చుచుండిరి. ఆపయిని
బుగడుగులు నడచిన తరువాత దినమున కొలఁటాల పాటుపడఁగలిగిన యొక
మరిపోతు నీళ్ళలోనున్న నడదోనెమీఁదికెక్కి నల్ల యనఁబడు పేనిన నెత్తురు
ద్దను త్రాటిచివరనున్న గాలమునకు గ్రుచ్చి, లేచి నిలువఁబడి కుడిచేతితో నతువ
లదిని త్రాడు గిరగిరత్రిప్పి లోతునీట న్విసరివైచి మరలఁ గూర్చుండి చేప
మెప్పుడు చిక్కునాయని తదేకధ్యానముతో త్రాడువంకనే చూచుచు త్రాడు కదలి
నప్పుడెల్ల నులికిపడుచు దైవవశమున చేప గాలమును మ్రింగి కొట్టుకొనుచుండ
మెల్లమెల్లగా లాగుచు, త్రాడు తెంపుకొని పాఱిపోవునో యను భయమునఁ

గుడిచేతిలోనిత్రాడు వదలుచు మరల లాఁగి ఉండగాఁ జుట్టుచు, చేప కలసట వచ్చిన తరువాత నోడ్డునకు లాఁగి పెన్నిధిగన్న పేదవలెఁ బరమానందము నొందుచు, ఒడ్డుదాఁక వచ్చిన తరువాత గ్రహచారము చాలక మత్స్యము త్రాడు తెంపుకొని పఱచిన చేతిలోఁబడ్డ సొమ్ముపోఁగొట్టుకొన్న వానివలె నిర్వేదించుచు చేఁప రాకపోగా రెండణాల గాలముకూడఁ బోయెనని విచారించుచు వట్టిచేతులతో నింటికి బోయెను, ఆ సమీపముననే యొడ్డునఁ జేరి కుఱ్ఱవాండ్రు వెదురుచువ్వ కొక దారమును గట్టి దాని కొననున్న చిన్న గాలమునకు ఎఱ్ఱలను గ్రుచ్చి నీళ్ళలో వైచుచుఁ దటాలునఁ దీయుచు జిన్నచేపలను బట్టుకొని మఱియొక దారమునకు గుదిగ్రుచ్చి 'నాకుఁ బదిజెల్లలు దొరికినవి' 'నాకు నాలుగు పరిగెలు దొరికిన' వని, యొండొరులతోఁ జెప్పుకొనుచు సంతోషించుచుండిరి అక్కడి జువ్విచెట్టుమీఁదఁ గూర్చుండి చూచుచున్న చెఱుగ్రద్దయొకటి యకస్మాత్తుగావచ్చి యొకటిరెండు పర్యాయములు పిల్లవాండ్రు త్రాటికి గ్రుచ్చుటకయి చేతఁబట్టుకొన్న చేపఁ నెగర దన్నుకొనిపోయెను

అప్పు డొక్క పెద్దముత్తయిదువ మొగమంతయు నొక్కటే బొట్టుపెట్టుకొని, బట్టలతోనున్న బుజముమీఁది బిందెను తీసి చేతఁబట్టుకొని రుక్మిణియున్న తావునకువచ్చి గౌరవము తోఁప "అమ్మాయిగారూ! ఏమి? మీరీవేళ స్నానమునకు దయచేసినారు"

రుక్మిణి—"కార్తికసోమవారము కాదా? కడపటి సోమవారము గనుక ప్రదోషవేళ మా అమ్మతోకూడ శివాలయమునకు వెళ్ళవలెనని గోదావరిస్నానము చేయ వచ్చినాను."

పెద్దముత్తైదువ—మీరు రాత్రిదాఁక భోజనము లేకుండ నుండఁగలరా?

రు—"ఒక్కదినమున కేమి? ఏలాగునైన నుందును మొన్న మీ రెండవ చిన్నదానికి శరీరములో నిమ్మళముగా లేదని చెప్పినావు ఇప్పుడు కొంచెము నిమ్మళముగా నున్నదా?"

పె—"ఏమి నిమ్మళమో నాకు తెలియదు మావారు రెణ్ణాళ్ళఁబట్టి కామావధానులచేత విభూతి పెట్టించుచున్నారు రాత్రి తెల్లవారినదాఁక నిద్రలేక బాధ పడినాము"

రు—"గ్రహబాధయా యేమి?"[1]

---

1. "ఏ యింట నే పురుషుడు మరణము నొందినను, ఏ తరుణి మరణము నొందినను దయ్యమయి తిరుగుచుండునని స్త్రీ పురుష సామాన్యముగా." ఆ రోజుల్లో నమ్మేవారని పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు.

మొదటి భాగం, మొదటి ప్రకరణం, పుట 11, 1982 ముద్రణం

1874 అక్టోబరు నెల వివేకవర్ధని ప్రారంభ సంచికలోనే దయ్యాలనుగూర్చి పంతులుగారు అవహాస్యంచేస్తూ వ్రాశారు.

పె—"అవునమ్మాయీ! ఏమి చెప్పుకోను? మగడు"—అని 'యిక్కడ నెవరునులేరుగదా' యని నాలుగు ప్రక్కలనుజూచి మఱింత దగ్గఱగా జరగి చెవిలో మెల్లగా "మగడు పట్టుకొని వేపుకొని తినుచున్నాఁడు. మీ రెఱుఁగుదురు గదా దానికి పెండ్లియయి మూడేండ్లుకాలేదు అప్పుడే దానిమగఁడు పోయి యాఱునెల లయినది అప్పటి నుండియు దానికి కొన్నాళ్ళు కలలోను కొన్నాళ్ళు రాత్రివేళ ఒంటరిగా నున్నప్పుడును కనఁబడుచునే యున్నాఁడు పిల్లది సిగ్గుచేత ఎవ్వరితోను చెప్పక దాఁచినది నెలదినముల నుండి దొత్తిగా ఎప్పుడును విడువక రేయింబగళ్లు వెంటవెంటనే యెక్కడికి వెళ్ళిన నక్కడికెల్లఁ దిరుగుచున్నాఁడు ఏమిపాపమోకాని మూఁడు దినములనుండి మఱింత పీకుకొని తినుచున్నాఁడు. ఈ మూణ్ణాళ్ళలోను పిల్లది సగమయిపోయినది. ఇంతేగదా? మగనితో"—అని కడుపులోనుండి దుఃఖము బయలుదేఱఁగాఁ గొంచె మాపుకొనుచుఁ గన్నీరు పైట చెఱఁగుతో తుడుచుకొనుచుఁ గొంచెముతాళి గద్గదస్వరముతో— "మగనితో సౌఖ్య మనుభవింపనా? కాపురము చేయనా?" అని కొంచెము బిగ్గరగా నేడ్వఁజొచ్చెను.

రు—(ఆ మాటలు మనసునకు నాఁటి యొకలు పులకరింపఁ గొంత తాళి ధైర్యము తెచ్చుకొని) "పెద్ద ముత్తైదువవు ఆలాగునఁ గంట తడి పెట్టరాదు. ఊరుకో? ఊరుకో! రోగము మనుష్యులకు రాక మ్రాకులకు వచ్చునా?"

పె—(ఏడుపు చాలించి) —'అమ్మాయీ! దానికే సౌఖ్యము నక్కఱలేదు. ఈలాగునైన నుండి బ్రతికి బట్టకట్టినఁ జాలును. మా ముసలిప్రాణములు రెండును బ్రతికి వాగున్నంతవఱకు దాని యన్న వస్త్రముల కేమియు లోపమురాదు'

రు—కొంచెముసేపేమో యాలోచించి—'సోమిదేవమ్మా? మీ వారు గ్రామములో పెద్ద సిద్ధాంతులుగదా? తెలిసికూడ చిన్నదానిని అంత యర్ధాయుష్మంతున—'[1]

---

1. "నేనారంభదశలో జ్యోతిశ్శాస్త్రమునందత్యంత విశ్వాసము కలవాడనేయైనను జన్మ పత్రికలలో దీర్ఘాయుష్మంతులగుదురని చెప్పబడినవారనేకు లల్పాయుష్కులగుచుండుటయు, మహాధనాఢ్యులగుదురని చెప్పబడినవారనేకులు దరిద్రులగుచుండుటయు, సంతానవంతు లగుదురన్నవారనేకులు సంతానహీనులగుచుండుటయు, చిరకాల సువాసినులగుదురన్న కాంతలు పలువురు బాల వితంతువులగుచుండుటయు, సుముహూర్తములు పెట్టుకొని చేసిన కార్యములు పెక్కులు భగ్నములగుచుండుటయు, చూచుచు వచ్చినకొలదిని నాకీ జ్యోతిష విషయమయి యంతకంతకు నమ్మకము తగ్గి లోకానుభవమధికమయిన తరువాత పూర్ణముగా నశించెను.

...సుముహూర్తములను బెట్టుకొని జన్మ పత్రములను బట్టి దీర్ఘాయుష్మంతులయిన వరుల నేర్పరచుకొని వివాహ కార్యములు నడుపునప్పుడు వివాహితలలో ననేకులేల బాల వితంతువులేల కావలెను?"

స్వీయచరిత్రము - మొదటిభాగము మొదటి ప్రకరణము; పుటలు, 6, 7—1982 వ ముద్రణం.

పె—(మాట కడ్డమువచ్చి)—"ఔనౌను ! నీ వడుగఁబోవునది నేను గ్రహించినాను ఎవరియదృష్టమున కెవరు కర్తలు ? దానికి ముండమోయవలసిన వ్రాఁత యుండఁగా నెవరు తప్పింపగలరు ? ఎవరైన జాతకము మంచిదిగాఁ జూచి వివాహము జేయుదురుగాని పెండ్లికుమారునకు లేని యాయువును తెచ్చి పోయఁగలరా ?"

రు—"అవును, జాతకములో మీ యల్లునకు పూర్ణాయుస్సే యున్నది కాఁబోలు !"

పె—(కొంచె మనుమానించి)—"పూర్ణాయుస్సా !—అవును పూర్ణాయుస్సే యున్నది. జాతకప్రకారము జరగదా అందువేమో. వేళ తిన్నగా కట్టి జాతకము వ్రాసినయెడల, అందులో నెన్ని యక్షరములున్నవో అన్ని యక్షరములును జరుగును. శాస్త్రము చక్కఁగా తెలియనివారు తిన్నగా వేళ కట్టలేక పాడు చేయుదురు మా వారు ఇన్ని ముహూర్తములు పెట్టినారుగదా ? నీ వెఱిఁగినంతవఱకు మఱియొక విధముగా నెక్కడనైన జరిగినదేమో చెప్పు."

రు—"కన్నమ్మగారి పిచ్చమ్మ వివాహముహూర్తము మా చావడిలో మన సిద్ధాంతిగారే పెట్టినారుగాని దాని మగనిజాతకము కూడ సిద్ధాంతిగారే వ్రాసి—"

పె—"అవును; ఒకానొకటి తప్పిపోవుటయుఁ గలదు. జ్యోతిషమునకుఁ బార్వతిశాప మున్నదఁట ! మావారెప్పుడును ఈ సంగతినే చెప్పుచుందురు. గట్టు మీఁద మట్టెలచప్పు డగుచున్నది ఎవ్వరో వచ్చుచున్నట్లున్నారు. ఈపాటికి మన మీ సంగతి చాలింతము" అని వెనుక తిరిగి చూచి బిందె యొడ్డున నుంచి స్నానమునకు నీళ్ళలో దిగుచున్నది.

ఇంతలోఁ గొందఱు పుణ్యస్త్రీలును విధవలును మెట్లుదిగుచు ముందున్నవారు వంగి కాళ్ళ వెండి పావడములను కొంచెము పయికిఁ దీసికొనుచు వెనుకఁ దిరిగి దూరముననున్నవారు వచ్చువఱకు దగ్గఱవారితో మాటలాడుచు మెల్ల మెల్లగా నీటి సమీపమునకు వచ్చి గృహకృత్యములను గుఱించి మాటాడుకొనుచు బిందెల నొడ్డునఁ బెట్టిరి. అందఱును నొక్కచోట సమావేశమయి సావకాశముగా మాటాడుకొనుటకు నీళ్ళకు వచ్చినప్పటికన్న మంచి సమయము స్త్రీలకెప్పుడును దొరకదు గదా ? అందుచేతనే వారు సాధారణముగా కొంచము తీఱుబడి చేసికొని మాటాడవలసిన నాలుగు మాటలను నీళ్ళకు వచ్చినప్పుడే మాటాడుకొని పోవుదురు. అప్పుడు ముప్పదియేండ్ల యీడుగల పొట్టిదొకతె ముందునకు వచ్చి ముక్కుమీఁద వ్రేలు వైచికొని "ఓసే ! వెంకమ్మా ! రాత్రి శేషమ్మను మగఁడు కొట్టినాఁడట ! విన్నావా ?"

వెంకమ్మ—"దానిని మగఁడెప్పుడును ఆలాగుననే కొట్టుచుండును. నెల దినములక్రింద కఱ్ఱపుచ్చుకొని కొట్టినప్పుడు చేతిగాజులన్నియు పగిలిపోయినవి."

పొట్టి—"దానిని మగఁడు తిన్నగా ఒల్లఁడట" అని బుగ్గను చేయి పెట్టుకొని "ఓసి ! ఓసి ! అతఁడు ముండనుంచుకొన్నాఁడఁట సుమీ"

బట్టతల ముత్తైదువ యొకతె చేతులు త్రిప్పుకొనుచు ముందునకు వచ్చి "సరి సరి ! దాని గుణము మాత్రము తిన్ననిదా ? మొన్న సుబ్బావధానుల కొడుకుతో మాటాడుచుండఁగా మగనికంటనే పడ్డదఁట ! మగవాఁడేలాగున నున్నను దోషములేదు. ఆఁడుదాని గుణము తిన్నగా నుండనక్కఱలేదా ?"

పొట్టి—"దాని కేమిగాని, పాపము ! చిన్నమ్మను అత్తగారు లోకములో లేని కోడంట్రికము పెట్టుచున్నది అంతేకాకుండ మగఁడింటికి వచ్చునప్పటికేవో నాలుగు లేనిపోని నేరములు కల్పించి చెప్పును దానిమీఁద అతఁడు ప్రతిదినమును దానిని చావగొట్టుచుండును"

పదియాఱు సంవత్సరముల వయస్సుగల యొక చామనచాయది కన్నుల నీరు పెట్టుకొనుచు—"అత్తగారు బ్రతికియున్నచోట్ల నెల్ల నిదే కర్మము లోకములో అత్తలెల్ల ఒకసారి చచ్చిరా"—

పొట్టిది—"శేషమ్మా ! నీ అత్తగారు కూడ నిన్ను చాలా బాధ పెట్టునని విన్నాను, నిజమా ?"

శేష—"బాధ గీధ నాకు తెలియదు కోఁత పడలేక చచ్చిపోవుచున్నాను; జాము తెల్లవాఱ లేచి యింటిప్రాచి యంతయుఁ జేసి, అంట్లు తోమి, యింటికి కావలసిన నీళ్ళన్నియు తోడి, మడి బట్టలుదికి, ఆమె లేచువఱకు పనులన్నియు జేయుచుందును అప్పుడు నాలుగు గడియల ప్రొద్దెక్కి లేచి కన్నులు నలుపుకొనుచు వచ్చి గరిసె నంటు వదలలేదని, వాకిటలోఁ బెంట యట్టేయున్నదని తిట్ట మొదలు పెట్టును తరువాత పేడచేసి గోఁడమీఁద పిడకలు చఱచి ఱెక్కలు విఱుచుకొని జాముప్రొద్దెక్కి చలిది భోజనమునకు వచ్చువఱకు, "ఒకమూల తెల్లవాఱక మునుపే తిండికి సిద్ధపడుచుందువు పని మాత్రము ముట్టుకో"వని వంట చేసికొనుచు సాధించుచుండును పగలు మగనితో మాటాడిన తప్పుగదా ![1] రాత్రి యందఱి భోజనములు అయిన తరువాత, అత్తగారికి కాళ్లు పిసికి యామె నిద్రపోయిన తరువాత వెళ్ళి పడుకోబోవునప్పటికి రాత్రి రెండుయామము లగును పడుకొన్నది మొదలుకొని యెప్పుడు తెలవాఱిపోవునో, వేకువఁ బనిగాకున్న అత్తగారెక్కడ కోపపడునో అని నిద్రలో సహిత ములికిపడుచుందును; ఎట్లు చేసినను నాకు తిట్లును దెబ్బలును తప్పవుగదా ?" అని మొగమునకు కొంగడ్డుపెట్టుకొని నేత్రముల నీరు కార్పఁజొచ్చెను

---

1. సత్యవతీ చరిత్రం నవలలో కూడా ఆనాటి కుటుంబ జీవితంలో కోడలి కష్టాలు వర్ణితమైనవి.

తాట—నీవన్నయాలోచన బాగున్నది. ఈ కోఁతిని బెదరించి మనమా వాలఖిల్యుని పట్టుకొంటిమా వేయిసువర్ణములు సంపాదించి మనము ధనికురాండ్రము కావచ్చును. మహాకాయుఁడెంత సొమ్మిచ్చియైన సీతనిని వదల్చుకొని పోక మానఁడు.

హిడిం—అట్లయిన మనమీ వాలఖిల్యుని పట్టుకొందము, నీవు చెట్టెక్కఁ గలవా ?

తాట—ఎలుకను బట్టుకొనుటకయి దుమికెడు పిల్లివలె నేనీ చెట్టుమీది కొక్క గంతువేసి వాలఖిల్యుని బట్టుకొనెదను నీవీకఱ్ఱచేతఁ బట్టుకొని క్రోఁతి క్రిందకుఱికి పాఱిపోకుండ జాగరూకతతో కాచి చూచుచుండుము.

ఆ మాటలు వినునప్పుడు నా బ్రతుకు ముందఱికివచ్చిన గోయియు వెనుకకుఁ బోయిన నూయియు వలెనుండెను ఈ ముగ్గురిలో నెవ్వరిచేతిలోఁ బడినను నాకు ప్రాణసంశయస్థితియే సంభవించును ఆ ముగ్గురును త్రేతాగ్నులనుగా నేనీవఱకే పోల్చియున్నానుగదా ! నన్నుఁగొనిపోయి దక్షిణస్వీకరించి విడువఁదలఁచినందున తాటకను దక్షిణాగ్నియనవచ్చును. నన్నుఁగొనిపోయి తన చెలికత్తె కర్పించి నన్ను గృహపతినిగాఁ జేయఁదలఁచినందున హిడింబిని గార్హపత్యాగ్ని యనవచ్చును నా నోటిలోనేదో క్రుక్కియో తోఁక నా మెడకుఁజుట్టఁ బెట్టియో హోమము నిమిత్తమై బ్రాహ్మణులు పశువునుబట్టినట్టుగా నూపిరి వెడలనియ్యక నా ప్రాణములు గొనఁ దలఁచినందున మర్కటము నాహవనీయాగ్నియని చెప్పవచ్చును. ఈ మూఁడగ్నులలో నాకప్పుడు దక్షిణాగ్ని మేలుగ తోఁచినందున నా యజమానుఁడైన మహాకాయుని వద్దఁజేరి సుఖింపవచ్చునన్న యాశచేత నేను తాటక చేతిలోఁ జిక్కఁదలఁచుకొని వానరముయొక్క యొడికోనుండి దుమికి యా రాక్షసిని కౌఁగిలించుకొనుటకయి చేతులు చాఁచుకొని సంసిద్ధుఁడనయి కూరుచుండియుంటిని. తా నొకటి తలఁచిన దైవమొకటి తలఁచునుగదా! తాటక వృక్షమారోహించుట చూచి యా దుష్టవానరము నన్ను విడిచి పాఱిపోక తన తోఁకను నేను మొదట ననుకొన్నట్టుగా నా మెడకుఁగాక నా పొట్టకు చుట్టఁబెట్టి నన్ను తన వీపుమీఁద నదిమిపెట్టి యా చెట్టుమీఁదినుండి మఱియొక చెట్టుమీఁదికి దుమికెను అంతట తాటక చెట్టు దిగివచ్చి హిడింబితో నేమో యాలోచించి వానరమును రాళ్ళతో విసరనారంభించెను. దానికి సహాయురాలయి హిడింబియు మామీఁద శిలల రువ్వసాగెను. ఆ శిలాయుద్ధమునకు తాళఁజాలక వానరరాజు చెట్టుమీఁదినుండి యుఱికి నన్ను వీపుమీఁద వేసికొని పాఱి పోవఁజొచ్చెను. వెనుకనుండి యఱచుచు నా రాక్షసాంగన లిరువురును మమ్ము తఱుముకొని వచ్చిరి. ఇట్లు కొంతదూరము పరుగెత్తునప్పటికి వెనుకఁజెప్పిన మహాకాయుని భృత్యులిద్దఱును ప్రక్కదారిని వచ్చువారిని గలిసికొని యేలపరుగెత్తుచున్నా

రనియడిగిరి. ఆ చెడుకోఁతి వాలఖిల్యుని నెత్తుకొని పాఱిపోవుచుండగా విడిపించుట
కయి పరుగెత్తుచున్నామని వారుత్తరము చెప్పిరి. ఇట్లు నలుగురును నొక్కచోటఁ
జేరునప్పటికి పూర్వమునన్న మండోదరి యప్పుడప్పుడు తీసికొని వచ్చెడి యుద్యాన
వనముకడకు మేము వచ్చితిమి. అంత నలుగురును గలిసి తనవెంటఁబడ మర్కట
రాజణుమాత్రమునను భయపడక నన్నువిడువక యక్కడనుండి యొక్క యంగవేసి
యెగిరి సువేలాద్రిమీఁదికి దుమికెను. ఆ వానరుఁడు గంతువేసినస్థలమునకు సువేలాద్రి
నాలుగు యోజనముల దూరములో నున్నదని నేనంతకుముందే మండోదరి వలన
నెఱిఁగియున్నాను. మర్కటము నన్ను వెన్నునఁ బెట్టుకొని కుప్పించి యుఱుకఁ
బోవునప్పుడు దైవమాయచేత నా కొక్క యావులింత వచ్చినది పూర్వాచారపరాయ
ణుఁడ నగుటచేత పెద్దల యాచారమును మిఱరాదని నేనప్పుడు కొండంతయాప
దలో నున్నను నా యావులింత పోవువఱకును చిటికలువేయుచుంటిని ఆ కోఁతితో
నేను సువేలాద్రిశిఖరమున వాఁలనప్పటికి లెక్కవేయఁగా నా చిటికలు సరిగా పది
యైనవి. ఆ లెక్కనుబట్టి పదిచిటికల కాలములో వానరము నాలుగు యోజనముల
దూరము దుముకునని నేను తెలిసికొంటిని. అప్పుడు నేను ముందువంకఁ జూచు
నప్పటికి నాయెదుట లవణసముద్రము మేఘమండలములనంటు తరంగములతోను
మేఘనాదములతో వియ్యమందు సంతతధ్వనితోను భయంకరముగాఁ గానఁబడెను
వానర మింక ముందువంకకు పాఱిపోవుట కవకాశము లేనందున నలుగురు వచ్చి
చుట్టవేసి నన్నుదక్కించుకొని మహాకాయున కియ్యవచ్చునని నాలోనేను సంతోష
పడుచుంటిని. ఇట్లు నేను మనోరథ సామ్రాజ్యానందము నొందుచుండఁగానే
వానరము కుప్పించి ముందువంక కుఱుకుట కుద్యుక్తమయి యున్నట్లుకనఁబడెను.
అందుచేత నే నీసారి యెంతదూరము దుముకునో చూడవలెనన్న యుత్సాహముచేత
ముందు సముద్రమున్నమాట మఱచిపోయి చిటికలు వేయుటకు మొదలుపెట్టితిని
ఇన్నూటయేఁబది చిటికలు లెక్కపెట్టునప్పటికి వానరము నన్నుఁగొని సముద్ర
మున కావలి యొడ్డుననున్న యొక విశాలమయిన యిసుకతిప్పలో వ్రాలినది. అప్పుడు
నేను గణితశాస్త్ర ప్రకారముగా లెక్కవేసి యిన్నూటయేఁబదింటిని పదింటిచేత
భాగింపఁగా వచ్చినలబ్ధ మిరువదియైదుకాఁగా, పదిచిటికల కాలములో దుముకఁగల
దూరము నాలుగుయోజనములగుటచేత నిరువదియైదును నాలుగుచేత గుణించి సము
ద్రముయొక్క వెడలుపు సరిగా నూఱుయోజనములని తెలిసికొని నేనత్యాశ్చర్య
పడితిని ఆహా! మన పూర్వులమహాత్మ్యము నేమని శ్లాఘింతును! వారు నిజంగా
సర్వజ్ఞులేసుండీ. అణుమాత్రమయినను హెచ్చుతగ్గులులేక నూఱుయోజనములని
రామాయణములోఁ జెప్పినదానికిని నేను కన్నులారా కొలిచి లెక్కవేసినదానికిని
సరిగా సరిపోయినది. లంకకును మన దేశమునకును నడుమనున్న సముద్రమిదియే
కదా ? నేను సముద్రమును దాఁటునప్పుడు శ్రీరాములవారు కట్టిన వారావధిని స్పష్ట
ముగా జూచినాను. మనుష్యులు లంకకుఁ బోవకుండుటకయి మరలివచ్చునప్పుడు

శ్రీరాములవారు కట్టను నడుమనడుమ తెగఁగొట్టిన సందులు నాకంటికి కరతలా-
మలకముగాఁ గనఁబడినవి. మన పూర్వులను గురించి యాలోచించుచు నేను కొంచె
మేమఱియుండఁగా వానరము నన్ను వెన్నుమీదినుండి తోఁకతో పైకెత్తి మఱి
యొక్క దుముకు దుమికినది. ఈసారి నేను వీపుమీఁదనానుకొని దృఢముగా
నుండక వాలమున ప్రేలుచు భయభ్రాంతుఁడయిన యుండుటచేత చిటికలువేసి
దూరమును కనుఁగొన లేకపోయినాను. నేనిట్లు దిగ్భ్రమ నొందియుండఁగానే
యా వానరము నన్ను నట్టడవిలో విడిచి యదృశ్యమయినది. అప్పటికి సూర్యగతిని
బట్టి నాలుగయిదు గడియల ప్రొద్దెక్కినట్లు తోఁచినది. కన్నులువిచ్చి చూడఁగా
నక్కడిచెట్లు మొదలయినవి లంకలోనివానివలె నత్యున్నతములుగాక మన దేశము
లోని సామాన్య వస్తుజాలమువలెనే యున్నవి. ఆ వానరముయొక్క వీపునానుకొని
సముద్రమును దాఁటునప్పుడు నాకు తోఁచలేదుగాని నన్నిక్కడకుఁ గొనివచ్చి విడి
చిన యామహానుభావుఁడెవ్వఁడాయన్న యాలోచన నా మనస్సున కిప్పుడు కలిగినది.
అతఁడు వాయుపుత్రుఁడైన హనుమంతుఁడయినందుకు సందేహములేదు అతఁడు
హనుమంతుఁడే కాకపోయినచో శతయోజనాయామమయిన సముద్రము నొక్క
యంగను దాఁటుటకు మఱియొక్కనికి సాధ్యమగునా? కాదు మనపెద్దలు చెప్పినట్లుగా
నతఁడు రావణాసురుని కాష్ఠమారిపోకుండునట్లుగా ప్రతిదినమును తాను దంతధావ
నము చేసికొన్న పుడకల నందు వేయుటకయి పోవుచుండును గాన నేఁటి యుద
యమున నన్నుజూచి జాలిదలచి పాదలేపములేని నేను రాక్షసుల దేశమునుండి
రాలేనని యిక్కడ తెచ్చి విడిచినాఁడు. నేనీ యడవిలోని ఘాతుకమృగముల వాఁత
బడక బ్రతికి యిచ్చటివారి యండఁజేరఁ గలిగినపక్షమున, రెండుమూఁడు మాసము
లలో వారి భాష నేర్చుకొని తరువాత నాకథను మీకు మహాత్ములచేతఁ బంపెదను.

సంపూర్ణము

# అనుబంధం – 1

# చింతామణి బహుమాన ప్రకటన

ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారిగా నవలా రచనలో పోటీలు నిర్వహించిన పత్రిక చింతామణి. 1892 వ సంవత్సరంలో రాజమండ్రి నుంచి ప్రారంభమై ఐదారేళ్ళు వచ్చి ఆగిపోయింది దీని ప్రకటన యాజమాన్యం న్యాపతి సుబ్బారావు పంతులుగారిది. వావిలాల వాసుదేవ శాస్త్రి, వీరేశలింగం ఆచంట సుందరరామయ్య ప్రభృతులు సుబ్బారావు పంతులుగారికి పత్రికా నిర్వహణలో తోడ్పడేవాళ్ళు. తెలుగులో నవలలు రావడం లేదనీ, నవలలు వ్రాసే వారికి ప్రోత్సాహం కలిగించడానికి ఉద్దేశిస్తూనూ, 1893 నుంచి చింతామణి పత్రిక నవలా రచనలో పోటీలు నిర్వహించింది. నవలా రచనా పోటీలో పాల్గొనదలచిన వాళ్ళు పాటించవలసిన నియమ నిబంధనలు వీరేశలింగం పంతులుగారే రూపొందించారని ఊహించడానికి అవకాశం ఉన్నది. 1893 వ సంవత్సరం జరిగిన మొదటి పోటీ ప్రకటనం యీ విధంగా ఉంది.

మొదటిసారి వెలువడ్డ ప్రకటనకు వివరణలు, సవరణలు కూడా పొందు పరుస్తూ ఆ తర్వాత సంచికలో విపులంగా నవలా రచనకు సంబంధించిన అంశాలు నిబంధితమైనాయి.

## చింతామణి బహుమానములు

### 1893 మార్చి నెల సం 2, సం. 9

తెలుగు భాష నభివృద్ధి చేయుటకును, తద్గ్రంథకర్తలకు ప్రోత్సాహము కలిగించుటకును 'చింతామణి బహుమానము' లని రెంటిని ద్రవ్య రూపమున నేర్పరచినారము. అందు మొదటి బహుమానమును ఒడసిన వారికి దెబ్బదియైదు రూప్యం

బులును రెండవ బహుమానమున కేబది రూప్యంబులు నియ్యబడును. ఈ బహుమానంబులనంద ప్రయత్నించువారీ క్రింది నిబంధనల కొడంబడి యొక 'వచన ప్రబంధము'ను వ్రాసి యంపవలెను.

1. ప్రబంధము (Novelette) ముద్రితమైనప్పుడు చింతామణి పుటలవంటి 50 పుటలకు తక్కువ కాకుండవలెను.

2. ప్రబంధమును వ్రాయునప్పుడు స్ఫుటమగు విడి యక్షరములతో కాగితమున కొక ప్రక్కను మాత్రమే వ్రాసి యంపవలెను గ్రంథము యొక్క మూల కథ హృదయ రంజకముగను స్వభావ విరుద్ధముగాకయు సులభ శైలిగ నుండవలెను.

3. ఆ గ్రంథము చింతామణి పత్రికాధిపతిగారికి జూన్ నెల 1 వ తేదీకిలోపుగ జేరవలయును.

4. గ్రంథముల నంపువారు తమ తమ నామంబులను గ్రంథము పయిని వ్రాయక యేదియో యొక గురుతునా గ్రంధము యొక్క మొదటి పుట పయినుంచి దానిని తెలియజేయుటకుగాను వేరొక యుత్తరమును వ్రాసి, అందు తమ నామంబులను పయి నిబంధనల కొడంబడుచు దాము పంపిన గ్రంథ నామమును దమ చిరునామాయును వ్రాసి యంపవలెను.

5. అట్లు పంపబడిన పుస్తకముల పరిశీలనార్థమయి మహారాజశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారును కందుకూరి వీరేశలింగముగారును చింతామణి పత్రికాధిపతులను మధ్యవర్తులుగా నేర్పడి, హృద్యంబులగు వానిని రెంటిని గొని తత్ఫలితమును సాధ్యమయినంత త్వరలో జూలయి నెల చింతామణి పత్రికలో ప్రచురింతురు.

6. బహుమానము లియ్యబడిన గ్రంథములు చింతామణి పత్రికయందు ప్రకటింప బడుచుండును. ఆ పత్రికయందవి పూర్ణముగా ప్రకటింపబడిన తరువాతనే కాని యంతకులోపుగా గ్రంథకర్తలు వానిని ప్రత్యేకముగా ప్రకటించు కొనగూడదు. బహుమానములు పడయని గ్రంథములు మరల వాని కర్తల కంపబడును.

# అనుబంధం - 2

## చింతామణి బహుమానములు

**1893 ఏప్రియల్ సం 2 సం. 10**

"గత పత్రిక యందు ప్రకటింపబడిన చింతామణి బహుమానముల నిమిత్తమయి ప్రయత్నించువారు వ్రాయవలసిన వచన ప్రబంధము లెట్లుండవలయునో తెలుపవలసినదని మమ్మనేకు లడుగుచున్నందున వారికి మార్గదర్శకములుగా నుండుటకయి కొన్ని సంగతుల నిందు వ్రాయుచున్నాము. ప్రబంధమనగా కల్పితమైన కథ. ఆ కథను పురాణేతిహాసాదుల నుండి గాని, చరిత్రముల నుండి గాని గైకొని కథా సారస్యమున కనుకూలముగా నుండులాగున దానికి నూతనాంశములను జేర్చి పెంచి వ్రాయవచ్చును; లేదా కవి మొదటి నుండి కడవఱకును స్వబుద్ధి చేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును. కథాంశము, వ్రాయువారి బుద్ధి విశేషము ననుసరించియుండును గాన దానిని గుఱించి విధులు చెప్పుట యనావశ్యకమేయైనను, కథ పూర్ణముగా కల్పితమయినను గొంతవఱకితర గ్రంథముల నుండి గ్రహింపబడినదైనను చమత్కారముగా నుండి చదువువారికి హృద్యముగా నుండవలెనని చెప్పుట యనావశ్యకము కాదు. శృంగారమో, వీరమో యేదో యొక రసమును ప్రధానముగా జేసికొని వివిధ రస సంయుతముగ నుండునట్లుగాని యాయా రసమును పోషించుటకయి వివిధ కష్ట సుఖములను ప్రయత్నములను కార్య విఘాతములను కార్య సాఫల్యములను మధ్య సందర్భోచితముగ దీసికొని వచ్చుచు కథయంతయు నొక్కని చరిత్రమువలె నుండునట్లు వ్రాయవలెను. కథ యందు వచ్చు పాత్రములలో నొక పురుషుని సన్మార్గునిగా జెప్పెడు పక్షమున వాని వర్తనమును తదనుగుణముగానే యంతకంతకు వికసింపజేసి ధర్మ మార్గానుసరణము నిమిత్తమయి కష్టములకోర్చుట ధర్మ మార్గము తొలగవలసి వచ్చునని పరితాపపడుట సత్కార్యమునకు వచ్చు విఘ్నములను ధైర్యోత్సాహములతో వారింపబాటుపడుట మొదలయిన సంగతులను

బలపఱచి వ్రాయవలెను. కథలోని యింకొక పాత్రమును దుష్టునిగా జెప్పెడు పక్షమున వాని దుష్ప్రవర్తనమును సహితము క్రమ క్రమముగా విస్తరింపజేసి మొట్టమొదట మనస్సులో దుశ్చింత పుట్టినప్పుడు పాపమునకు భయపడి వెనుక తీసి రాగ ద్వేషాదుల ప్రేరణముచే తన కార్యక్రమమునకు లోబడుట, తరువాత గొంత పశ్చాత్తాపపడినను దిన దిన క్రమమున కఠినుడయి యకార్యకరణమునకు సందేహింపకుండుట, మోసము మొదలయిన దుష్కార్యముల వలన మొదట గొంత కాలము కార్య సిద్ధియగునట్లు కనవడినను కడపటి కృషియంతయు విఫలమయి ధర్మమునకే విజయము కలుగుట మొదలయిన సంగతులను బలపఱచి వ్రాయవలెను ఈ ప్రకారముగానే యొక పాత్రమును శూరునిగానో, భీరునిగానో, కాముకునిగానో, విరాగినిగానో యెట్లు చెప్పినను తత్తద్రసోచితముగా వాని గుణముల నంతకంతకు విస్తరింపజేసి స్వభావము ననుసరించి వర్ణించవలెను. మధ్య మధ్య నెన్ని పాత్రములు వచ్చుచున్నను, కథకంతకును ముఖ్య నాయకుడొక డుండవలెను; నాయకునితోడిపాటుగా నొక కథానాయికయు నుండవచ్చును. ఈ వచన ప్రబంధములయందు కథ కేవల కల్పితమే యైనను స్వభావ విరుద్ధముగా నుండక నిజముగా జరుగుచున్న చరిత్రమువలె నుండి చదువు వారికి హృదయాహ్లాదకరముగా నుండవలెను కథలో సందర్భోచితముగా జనుల యాచారవ్యవహారములను కార్యములు జరిగిన స్థలములు మొదలయిన వానిని వర్ణింపవలసినప్పుడా వర్ణనలను అసంభావ్యములుగా నుండునట్లు చేయక నైసర్గికముగాను వినోదకరముగాను జేయవలెను. కథయందు రసోచితముగా శృంగార వర్ణనము చేయవచ్చినను మన కావ్యములయందున్న రీతిగా కుచకచ సంభోగాది వర్ణనలు చేయకూడదు కథ చమత్కారముగా నుండవలసినను నీతి బాహ్యముగా నుండగూడదు; మొత్తముమీద కథయొక్క ఫలితార్థమంతయు నేదో యొక నీతిని బోధించునదిగా నుండవలెను. కవి హాస్య వచనములు మొదలయిన వానిచేత వాక్చమత్కృతిని జూపవలసినను స్త్రీలు చదువగూడని మృదుత్వము తప్పిన మోటు మాటలుగాని యంశములుగాని యుపయోగింపగూడదు. ఒక్కతే పాటగా కథనంతను ప్రథమ పురుషమునందే వ్రాయక నాటకములయందు పాత్రము లొండొరులతో మాటాడుకొనునట్లు నడుమ నడుమ సంభాషణములను బెట్టుచు వచ్చిన బాగుగనుండును. సంభాషణములను జేయువారి యొక్క కులాదులనుబట్టి జాతీయముగా వారి సంభాషణలను గ్రామ్యపదములలో నుంచవచ్చును. సంభాషణములు గాక మిగిలిన కథాంశమునందు సహితము సాధ్యమైనంత వరకు కేవల

గ్రాంథిక పదములను దీర్ఘ సమాసములను విడిచి మృదు మధుర పదములతో, సులభశైలినే యుపయోగించవలెను. చదువు వారికి హృదయ రంజకముగా నుండుట కయి తగిన స్థలముల యందర్థాలంకారములను శబ్దాలంకారములను గూర్చుట యావశ్యక మేమయినను అలంకారముల నిమిత్తమయి రసమునకుగాని పద లాలిత్యమునకు గాని భావ గౌరవమునకుగాని యెంత మాత్రమును భంగము కలుగ నియ్యగూడదు

ఇటువంటి వచన ప్రబంధములను పశ్చిమ ఖండవాసులు విశేషముగా వృద్ధి చేసిరే కాని మనవారీ విషయమున నంతగా గృషి చేయలేదు ఆదేశమునందు సహితము మొట్టమొదట నీ పుస్తకములు కథల మూలముననే యారంభమయి యంత కంతకు స్వాభావికమయిన యిప్పటి ప్రబంధ రూపమున వృద్ధి బొందినవి. మన దేశమునందలి పంచతంత్రము, హితోపదేశము, హంసవింశతి, శుకసప్తతి మొదలయిన కథలా దేశమునందు మొట్టమొదట పుట్టిన కథల వంటివే కొంతకాలమయిన తరువాత మన దేశమునందా కథలు సంస్కృతమున దశకుమార చరిత్రము మొదలైనవి గాను తెనుగున షోడశ కుమార చరిత్రము మొదలయినవిగాను గొంతవఱకు వృద్ధినొందెనుగాని యా వృద్ధి క్రమక్రమముగా రాక యంతటితో నిలిచిపోయినది. ఇంగ్లీషువారు వ్రాసిన గ్రంథములను జూచి యిప్పటి మనవారు వచన ప్రబంధములను వ్రాయ నారంభించినారుగాని యింకను మన భాషలో నుండవలసినన్ని పుస్తకములు పుట్టలేదు. రాజశేఖర చరిత్రము, సత్యరాజా పూర్వ దేశయాత్రలు, సత్యవతీ చరిత్రము, సత్యసంజీవని మొదలయిన పుస్తకములీ తరగతిలో జేరినవి. ఇంగ్లీషు భాషా పరిశ్రమము లేక యిటువంటి వచన ప్రబంధములను రచియింపదలచుకొన్నవారు కొంతవఱకు పయి పుస్తకములను దమకు మార్గప్రదర్శకములనుగా జేసికొనవచ్చును. మన భాషయందిటువంటి నూతన ప్రబంధములను, తన్మూలమున భాషను వృద్ధి చేయుటయే యీ చింతామణి బహుమానముల యుద్దేశము. ఇప్పుడుద్దేశింపబడిన పుస్తకములు సామాన్యమయిన వ్రాతలో నూఱు పుటలున్న పక్షమున, ముద్రింపబడినప్పు డేబది పుటలలో నిముడవచ్చును.

## అనుబంధం - 3

# చింతామణి బహుమాన నిర్ణయము

### చింతామణి 1893 జూలై, సం. 3 సం. 1

చింతామణి బహుమానములకయి పంపబడిన పుస్తకములను పరిశీలించి బహుమాన నిర్ణయము చేయుటకేర్పడిన మధ్యవర్తులు ముగ్గురును నేకాభిప్రాయము గలవారై మొదటి బహుమానమును ఖండవిల్లి రామచంద్రుడు గారికిని. రెండవ బహుమానమును తల్లాప్రగడ సూర్యనారాయణగారికిని ఇచ్చుటకు నిశ్చయము చేసినారు. బహుమానములు పడసిన గ్రంథములలో మొదటిదానిని ఈ పత్రిక యందు ప్రచురించుట కారంభించినాము. ఈ గ్రంథము ముగిసిన తరువాత రెండవ గ్రంథమును బ్రకటింతుము.

# అనుబంధం - 4

## Second Year's Chintamani Prizes

చింతామణి సం 4 సం. 2 1894 ఆగస్టు

For the encouragement of Telugu authors, we offer two prizes in cash called "Chintamani Prizes" the first Rs. 125/- and the second of Rs. 75/- for the best Telugu novelette under the following conditions.

[అని ఇంగ్లీషులో ప్రకటించి తొలిసారి బహుమాన ప్రకటనం చేసినప్పటి నిబంధనలనే తెలుగులో మళ్ళీ ప్రకటించారు. రెండో బహుమాన ప్రకటననుబట్టి నవలలు చేరవలసిన గడువు తేది 1-3-1894 - సం॥]

రెండో సంవత్సరపు చింతామణి బహుమాన ప్రకటనం.

"ప్రకటన ననుసరించి యీ సం॥ము పదునైదుగురు వచన ప్రబంధములను వ్రాసి మాకు బంపియున్నారు....

ఉన్న వానిలో సమస్టి మీద నాలోచించి చూడగా గోటేటి కనకరాజుగారిచేత రచియింపబడిన వివేక విజయమును, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచేత రచియింపబడిన రామచంద్ర విజయమును బహుమానార్హములని యేర్పడినవి. అయినను పయి రెండుగ్రంథములు నించుమించుగా సమాన గుణవంతములుగానే కనబడినందున ... వానిలో నొకటియే యగ్ర గౌరవమున కర్హమయినదని నిర్ధారణము చేయుటకు వలనుపడలేదు. కాబట్టి రెండును సమాన గౌరవమునకే యోగ్యములయినవని యేర్పఱచి రెండు బహుమానములకును నిర్ణయింపబడిన ధనమును మొత్తము చేసి యిరువురు గ్రంథకర్తలకును సమానముగా బంచిపెట్టుటకు నిశ్చయించినాము....

మఱియు మా వద్దకు బంపబడిన పుస్తకములలో బులుసు పాపయ్యశాస్త్రిగారు రచించిన భాస్కర విలాసమను చిన్న పుస్తకము బహుమానమును పొందకపోయినను రచనా కుశలత్వము, నీతి బోధకత్వము మొదలయిన గుణ విశేషములనుబట్టి యిందు ప్రచురింపబడుచున్నది